www.rayalaseemajagruti.com



# రాయలసీమ జాగృతి

తెలుగు మాసపత్రిక    అక్షరాల అమ్ములపొది

సంపుటి : 02    సంచిక : 01    జూన్ 2017    పేజీలు : 36    రూ.20/-

RNI/APTEL/2016/69069

## భావిభారత నిర్మాతలకు నూతన విద్యా సంవత్సరానికి స్వాగతం...

**ధరిత్రిని కాపాడుకుందాం**



# జూన్ 5న
# ప్రపంచ పర్యావరణ
# దినోత్సవం

సంపుటి : 02 సంచిక : 01
జూన్ 2017



ఎడిటర్ - ఇన్ - చీఫ్
**ఎస్. శ్రీహరి మూర్తి** M.A., H.PT.,
సెల్ : 9866216044

**ప్రతినిధులు**

| | |
|---|---|
| అనంతపురం | కాగొల్ల రాజు |
| ప్రొద్దుటూరు | వరప్రసాద్ |
| తెలంగాణ | బావండ్లపల్లి చెన్నయ్య |
| కర్నూలు | ఓబులేసు |
| రాజంపేట | సతీష్ |
| పుంగనూరు | శ్రీనివాసులు |
| ఆదోని | రాఘవేంద్ర |
| కళ్యాణదుర్గం | మహేశ్ నాయక్ |

**ప్రధాన కార్యాలయం**
డొ.నెం.13/3-645, ఖాజానగర్
గంగాగౌరి థియేటర్ దగ్గర, అనంతపురం



Email : rayalaseemajagruti@gmail.com,
: sreeharis16@gmail.com,
RNI.NO.APTEL/2016/69069

# విషయ సూచిక

| | |
|---|---|
| 1. హరిహర ధామం విశిష్ఠ క్షేత్రం పుష్పగిరి | 5 |
| 2. గ్రంధాలయోద్యమ పితామహుడు గాడిచెర్ల | 8 |
| 3. హ్యుటగాజీలో అతిముఖ్యమైన అంశం కోరిలేషన్ | 10 |
| 4. ఆంధ్ర ప్రదేశ్ వివాహాల నిర్బంధ నమోదు చట్టం | 13 |
| 5. సింగమనేని కథల్లో రైతు ఆత్మహత్యలపై ఓ పరిశీలన | 15 |
| 6. సమతుల ఆహారం... సాధారణ జీవన చక్రం | 17 |
| 7. కరువు సహాయక చర్యలేవీ? | 18 |
| 8. బోడి కోడె | 23 |
| 9. భూతాపంతో కరువులు, వరదలు | 26 |
| 10. ఎవరి కోసం ఈ కసరత్తు | 29 |
| 11. రాయలసీమ ఉద్యమాలు తీరుతెన్నులు | 33 |

# భవితకు బాటలు వేసేదే చదువు

ఒక వ్యక్తి కుటుంబం, సమాజం, జాతి జీవనంలో విద్య అన్నది ఎంతో ముఖ్యమైన అభివృద్ధి కారకం సరైన విద్యా బుద్ధులు నేర్పించగలిగితేనే మెరుగైన నిపుణత కలిగిన మానవ వనరులను రూపొందించగలం. పరిశోధన, నవీకరణలను ప్రోత్సహించి సంబంధిత సామర్థ్యాలను పెంపొందించడంలో జాతికి చదువే తోడ్పడుతుంది. వ్యక్తిత్వాన్ని, శీల సంపదను, విలువతో కూడిన జీవన విధానాన్ని అలవరచడం ద్వారా ఒక వ్యక్తిని విశ్వమానవుడిగా తీర్చిదిద్దగలిగేది విద్యే. అందువల్ల విద్యా వ్యవస్థను సంస్కరించడానికి ప్రతి దేశం తీవ్రంగా ప్రయత్నిస్తోంది. ఎప్పటికప్పుడు విద్యా విధానాన్ని సమీక్షించుకుంటోంది. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఈ విషయంలో ఎన్నో ప్రధాన చర్చలు చేపట్టారు. తొలుత మొదలియార్ కమిషన్‌ను, తరువాత కొఠారి కమిషన్‌ను ఏర్పాటు చేశారు. 1986లో జాతీయ విద్యా విధానాన్ని రూపొందించారు. 1992లో దానిని సవరించారు. అది జరిగి పాతకేళ్లయ్యింది. స్థితిగతులు మారుతున్నాయి. అందుకు అనుగుణంగా ప్రజల అవసరాలూ మారుతున్నాయి. నాణ్యమైన విద్య, నవీకరణ, పరిశోధనలను వారు కోరుకుంటున్నారు. దీన్ని దృష్టిలో పెట్టుకుని జాతీయ విద్యా విధానాన్ని సమీక్షించాల్సిన అవసరం ఉంది. ఈ దశలో నిరంతర ప్రయత్నాలు జరిగాయి. విస్తృత ఏకీభావం, సమగ్ర చర్చలు, సంప్రదింపుల ద్వారా కొత్త విధానాన్ని తీసుకువచ్చేందుకు కృషి చేయాల్సిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. అందుకోసమే భారత ప్రభుత్వం 2015 జనవరిలో సమీక్షకు శ్రీకారం చుట్టింది. గడచిన రెండేళ్ల నుంచి జరుపుతున్న చర్చల సారాంశాన్నంతా క్రోడీకరిస్తూ కేంద్ర ప్రభుత్వం జాతీయ విద్యావిధానం ముసాయిదా ప్రకటించింది. టీఎస్ఆర్ సుబ్రహ్మణ్యన్ అధ్యక్షతన ఏర్పాటైన ఈ సంఘం తయారు చేసిన నివేదిక ఆధారంగా విద్యా వ్యవస్థపై ఆసక్తి కలిగిన వారి అభిప్రాయాలు కోరుతూ మానవ వనరుల మంత్రిత్వ శాఖ అంతర్జాలంలో దాన్ని పొందుపరిచింది. దీనిపై అభిప్రాయాలు, సూచనలు స్వీకరించి, సమీక్షించిన తరువాత భారత ప్రభుత్వం నూతన విద్యా విధానంపై సమగ్ర ప్రకటన వెలువరించే అవకాశం ఉంది. సుబ్రహ్మణ్యన్ చెప్పినట్లు మంత్రిత్వ శాఖ అంతర్జాలంలో సంక్షిప్త నివేదికను మాత్రమే వెల్లడించింది. మొత్తం నివేదిక ప్రతిని బయట పెడితే ప్రజలకు మరిన్ని విషయాలు బయటపడేవి. అయినప్పటికీ మూలవిషయాలపై అవగాహన కలగడానికి ఈ ముసాయిదా ఉపయోగపడుతుంది.

కొత్త సవాళ్లకు దీటుగా ఉన్నత విద్యకు సంబంధించి ముసాయిదాను ప్రకటించారు. ఉపాధి అవకాశాల్లో అంతరాన్ని తగ్గించడం, నైపుణ్య భారత్ మిషన్ ఆధారంగా నైపుణ్యాల అభివృద్ధిపై ప్రత్యేక శ్రద్ధ వృత్తి సాంకేతిక విద్యలకు ఇతోధిక ప్రోత్సాహం జీవిత కాలం చదువు వంటి వాటిని ముసాయిదాలో పేర్కొనడం సంతోషాన్నిస్తుంది. నేటికీ ఉన్నత విద్యా రంగంలో స్థూల ప్రవేశాల నిష్పత్తి 26.3% మాత్రమే. ఈ నిష్పత్తి సామాజికంగా వెనుకబడిన వర్గాలైన ఎస్సీ, ఎస్టీల్లో మరింత తక్కువగా ఉంది. ఈ అసమానత సమస్యను సరిదిద్దే పరిష్కార మార్గాల్లో వేటికీ ముసాయిదాలో ప్రస్తావించలేదు. ఉన్నత విద్యా సంస్థలను పరిశోధనలకు నూతన ఆవిష్కరణలకు కేంద్రాలుగా తీర్చిదిద్దాలని ముసాయిదాలో అభిలషించారు. దేశంలోని మొత్తం విశ్వవిద్యాలయాలు, కళాశాలల్లో కనీసం మూడో వంతు ఈ పథకం కిందకు తీసుకు వస్తే తప్ప ఫలితాలు రావు. ఉన్నత విద్యలో పాలన వ్యవస్థలను సంస్కరించడం ముసాయిదా ప్రస్తావించిన మరో ముఖ్య అంశం. ఇందుకోసం సివిల్ సర్వీసెస్ తరహాలో భారతీయ విద్యాసేవల వ్యవస్థను (ఇండియన్ ఎడ్యుకేషన్ సర్వీస్) ఏర్పాటు చేయాలని ప్రభుత్వం ఆలోచిస్తోంది. నిజానికి బ్రిటిష్ వారి కాలంలోనే ప్రజా పాలన సేవలలో ఒకటిగా విద్యా సర్వీసు సైతం 1896 నుంచి 1924 వరకు కొనసాగింది. సమకాలీన పరిస్థితులకు అనుగుణంగా ఈ సర్వీసులకు రెండు మార్గాల్లో అధికారులను ఎంపిక చేస్తే బాగుంటుంది. అనుభవం, విద్యార్హతలు ఉన్న కొందరు విద్యావేత్తలను ఒక భాగంగా, సివిల్ సర్వీసెస్ తరహాలో ప్రత్యక్ష ఎంపిక విధానం ద్వారా కొందరిని కలిపి భారతీయ విద్యా సేవల వ్యవస్థను రూపొందిస్తే ప్రయోజనకరంగా ఉంటుంది. విధాన ప్రకటనలో ఈ విషయంలో ప్రభుత్వం మరింత స్పష్టనివ్వాలి. దేశ విద్యా వ్యవస్థను సమూలంగా సంస్కరించి మరిన్ని సృజనాత్మకత, క్రియాశీల అంశాలను జోడించి విద్యా ప్రకటనను జారీ చేయడంపై ప్రభుత్వం దృష్టి పెట్టాలి.

మీ... ఎడిటర్

శ్రీహరిమూర్తి

# హరిహర ధామం... విశిష్ట క్షేత్రం... 'పుష్పగిరి'



వైఎస్ఆర్ జిల్లా కేంద్రమైన కడప నగరానికి 14 కి.మీ దూరంలో వల్లూరు మండలంలో ఉంది పుష్పగిరి క్షేత్రం. పవిత్ర పినాకిని (పెన్నా) నది ఒడ్డున గుట్టకు ఆనుకొని పంచనదీ సంగమ ప్రాంతంలో గొప్ప ఆధ్యాత్మిక క్షేత్రం విరాజిల్లుతోంది. పాపాగ్ని, వల్కల, మాండవ్య, కుముద్వతీ నదులు ఈ ప్రదేశం పెన్నానదిలో కలుస్తాయి గనుకనే దీన్ని పంచనదీ సంగమ క్షేత్రంగా ఏర్కొంటారు.

**పేరు వెనుక గాథలు :** 'పుష్పగిరి' పేరు ఎవరికైనా ఆసక్తి కలిగిస్తుంది. ఈ పేరు వెనుక గల విశేషమేమిటో తెలుసుకోవాలన్న కుతూహలం కలుగుతుంది. నిజానికి ఈ క్షేత్రానికి ఈ పేరు రావడం వెనుక స్థానికంగా పలు కథనాలు ప్రాచుర్యంలో ఉన్నాయి. గరుత్మంతుడు తన తల్లి దాస్య విముక్తి కోసం అమృత భాండం తెస్తున్న సమయంలో ఈ పంచనదీ సంగమ ప్రాంతంలో ఆ అమృత భాండం నుంచి ఒక బిందువు తొణికి పడిందన్నది ఒక కథనం. అప్పటి నుంచి ఈ ప్రాంతంలోని నదిలోని జలం అమృత తుల్యమై అందులో స్నానం చేసే రోగులు ఆరోగ్యవంతులుగా, వృద్ధులు యువకుల్లా శక్తి పుంజుకునే వారట. విషయం తెలుసుకున్న బ్రహ్మ పంచనదీ సంగమం వల్ల ఏర్పడిన అమృతంగా మారిన ఆ సరస్సును మూసివేయమని గరుత్మంతుడిని కోరాడట. ఆయన ఒక పర్వతాన్ని ఆ సరస్సులో వేయగా అది నీటిపై పుష్పంలా తేలిందట. దాన్ని కదలకుండా ఉంచేందుకు శివకేశవులు ఆ గిరిపై వెలిశారనీ, అందుకే దాన్ని పుష్పగిరి అంటారన్నది ఓ కథనం.

**పురాణ ప్రసిద్ధి చెందిన దేవాలయాలకు నిలయంగా, ఎన్నెన్నో చారిత్రక ప్రాధాన్యతలు గలదిగా, ఆధ్యాత్మిక నిలయంగా విలసిల్లుతున్న ప్రాంతాల్లో వైఎస్ఆర్ జిల్లా ముందు వరసలో నిలుస్తోంది. హరిహర క్షేత్రంగా, పంచనదీ సంగమ స్థలిగా, విశిష్ట శైవారామాల నిలయంగా, మధ్య కైలాసంగా, తెలుగు నాట శ్రీ ఆది శంకరాచార్యులు తొలిసరాఇగా శ్రీచక్రాన్ని ప్రతిష్ఠించిన దివ్యధామంగా, కళ్లు చెదిరే శిల్ప సంపదకు ఆటపట్టుగా, రాయలసీమలో విశిష్ట పర్యాటక ప్రాంతంగా విరాజిల్లుతున్న ఆధ్యాత్మిక క్షేత్రం పుష్పగిరి.**

సీతాన్వేషణ సమయంలో శ్రీ రామ లక్ష్మణులు ఈ క్షేత్రంలో ఆగి శివునికి పూజలు చేశారనీ, పూజకు వాడిన పూలను మరుసటి రోజు నదిలో వేస్తుండటంతో, ఆ పూలు నదిలో గుట్టలుగా తేలాయనీ, అందుకే ఈ ప్రాంతాన్ని 'పుష్పగిరి' అంటారనీ మరో కథనం కూడా ప్రచారంలో ఉంది.

**జనమే జయుని ప్రతిష్ఠ :** ఆలయ నిర్మాణ కాలం గురించి స్పష్టత లేకపోయినా ఈ క్షేత్రంలోని మూల మూర్తులను జనమే జయ మహారాజు ప్రతిష్ఠించాడని ఈ ప్రాంతీయుల విశ్వాసం. ఇందులోని చెన్నకేశవస్వామి మూలమూర్తి శిథిలం కాగా నాటి ఈ ప్రాంత పాలకుడు త్రైలోక్య

మల్ల మహారాజుకు ప్రధానిగా ఉండిన తిమ్మయ్య శిథిలమూర్తి స్థానంలో నూతన మూర్తిని ప్రతిష్ఠించారు. చెన్నకేశవాలయానికి వెళ్లే మార్గంలో మెట్లపై హళెకన్నడ తమిళ లిపిలో ఉన్న శాసనాల ద్వారా ఈ విషయం తెలుస్తోంది. ఈ ప్రాంతం త్రైలోక్య మల్ల మహారాజు పాలించినట్లు కర్నూలు జిల్లాలోని 1069 నాటి శాసనం చెబుతోంది. దీన్నిబట్టి పుష్పగిరి ఆలయాలు 1069 నాటికంటే ప్రాచీనమైనదని భావించాల్సి ఉంది. త్రైలోక్య మల్లునితోబాటు, కరికాల చోళులు శ్రీకృష్ణదేవరాయలు, ఆ తర్వాతి పాలకులు కూడా ఈ క్షేత్రంలో ఎన్నో పునరుద్ధరణ పనులు చేశారు. వీరిలో ఎందరో రాజులు మడులూ, బంగారు వజ్ర ఖచిత ఆభరణాలు, గ్రామాలూ, పంట భూములూ ఈ ఆలయాలకు మాన్యాలుగా ధారదత్తం చేశారు. వీటికి సంబంధించిన వివరాలుగల శాసనాలు పలు ప్రాంతాల్లో వెలుగు చూశాయి.

**అపురూప ఆలయాలు :** పుష్పగిరి గ్రామానికి తూర్పున పెన్నానది ఒడ్డున గల గుట్టపై శ్రీ చెన్నకేశవస్వామి, ఉమా మల్లేశ్వరస్వామి, సంతాన మల్లీశ్వరుడు, సాక్షి మల్లికార్జునుడు, యోగాంజనేయ స్వామి ఆలయాలున్నాయి. నదికి పడమరగా పుష్పగిరి గ్రామంలో శ్రీ కాశీవిశ్వనాథ, భీమేశ్వర, త్రికూటేశ్వర, ఢుంఠి వినాయకస్వామి, శ్రీ కామాక్షీ మాత ఆలయాలున్నాయి. కామాక్షీమాత ఆలయంలో మహా మేరువు 'శ్రీచక్రం' ఉండటం విశేషం.ఈ ప్రాంగణంలోనే కరికాల చోళ మహారాజు నిర్మించిన శ్రీ వైద్యనాథేశ్వరస్వామి ఆలయం, అందులో మూలమూర్తి ఎదురుగా గల కుడ్యానికి దేవ వైద్యుడు ధన్వంతరి శిల్పం వుంది. నాటి వైద్యులు, సమీప అడవుల్లో లభించే వనమూలికలను తెచ్చి, ఆలయం అరుగులే కల్వాలుగా మందులు తయారు చేసిచ్చేవా రనీ, అందుకే ఈ ఆలయాన్ని 'వైద్య' నాథేశ్వరుడుగా వ్యవహరిస్తున్నారనీ పెద్దలు తెలుపుతున్నారు.

**విశిష్ట పీఠం :** పుష్పగిరి క్షేత్రంలో శ్రీ శంకరాచార్యులు పీఠం ఉంది. ఆది శంకరులే స్వయంగా స్థాపించిన పీఠం ఇది. తెలుగు నాటగల ఏకైక పీఠం. ఈ పీఠం ఆధ్వర్యంలో గల శ్రీ చంద్రమౌళీశ్వర ఆలయంలోని స్పటికలింగం ఎంతో విశిష్టమైనది. దేశంలోని పీఠాలలో ఎన్నో ప్రత్యేకతలుగల ఈ పీఠానికి ప్రస్తుతం శ్రీ విద్యానృసింహభారతి స్వామి అధిపతులుగా ఉన్నారు. శ్రీ చెన్నకేశవస్వామి ఆలయాలను చుట్టుపక్కల కిలోమీటరు వరకూ పలు శిథిల దేవాలయాలను నేటికీ చూడవచ్చు. ఒకప్పుడు ఇక్కడ 108 శివకేశవుల దేవాలయాలుండేవని అనడానికి ఈ శిథిలాలే సాక్ష్యంగా నిలుస్తున్నాయి. ఉత్తర కైలాసమైన వారణాశికీ, దక్షిణ కైలాసమైన చిదంబరం క్షేత్రానికి మధ్యలో ఉండటంతో పుష్పగిరి క్షేత్రాన్ని శైవులు 'మధ్య కైలాసం'గా భావిస్తే, వైష్ణవులు మధ్య అహోబిలంగా భావిస్తుంటారు. ఇక్కడి శంకరాచార్య పీఠం ఒకప్పుడు ప్రముఖ వేద విద్యానిలయంగా విశిష్ట గురుకులంగా ఉండిందనీ, దేశం నలుమూలల నుంచీ విద్యార్థులు విద్యాభ్యాసం కోసం ఈ పీఠానికి వచ్చేవారనీ పీఠం చరిత్ర ద్వారా తెలుస్తోంది. బ్రహ్మాండ పురాణంలో పుష్పగిరి క్షేత్రాన్ని శ్రీశైలం, ఉజ్జయినీ క్షేత్రాలతో సమానమైనదిగా, గొప్ప ఆధ్యాత్మిక క్షేత్రంగా వివరించారని పెద్దలు చెబుతున్నారు.

**ఉత్సవాలు :** పుష్పగిరిలో జరిగే ఉత్సవాలకు జిల్లా నలుమూలల నుంచే కాక, రాష్ట్రంలోని పలు ప్రాంతాల నుంచి భక్తులు హాజరవుతారు. ఏటా చైత్ర బహుళ త్రయోదశి నుంచి, వైశాఖ శుద్ధ సప్తమి వరకూ శ్రీ చెన్నకేశవస్వామికి బ్రహ్మోత్సవాలు నిర్వహిస్తారు. ఇందులో అక్షయ తదియ వైశాఖ శుద్ధ తదియ నాడు ప్రధాన ఉత్సవం నిర్వహిస్తారు......

**పిండ ప్రదానాలు :** దక్షిణ 'కాశి'గా పేర్కొనే పుష్పగిరి క్షేత్రం పిండ ప్రదానాలకు నిలయం. ఇక్కడి



పెన్నానదిలో పితృకర్మలు నిర్వహిస్తే, తమ పెద్దల ఆత్మలు శాంతిస్తాయనీ, వారికి స్వర్గలోకం ప్రాప్తిస్తుందనీ భక్తుల్లో ప్రగాఢ విశ్వాసం ఉంది. ఈ క్షేత్రంలో పిండ ప్రదానం చేస్తే కాశీ క్షే త్రంలో చేసినంత ఫలితం లభిస్తుందని గాఢంగా విశ్వసిస్తారు. దక్షిణాదిన పలు ప్రాంతాల నుంచి పుష్పగిరికి పిండ ప్రదానా నికి ప్రజలు నిరంతరం వస్తూనే ఉంటారు. శివకేశవులకు బేధం లేదని తెలుపుతున్న క్షేత్రం గనుక శైవులూ, వైష్ణవులూ కూడా ఈ క్షేత్రాన్ని విశేష సంఖ్యలో దర్శించుకుంటారు.



**రెండు కళ్లూ చాలవు :** పుష్పగిరిలోని ఆలయాల్లో గల శిల్పాలను ఎంతగా చూసినా తినివి తీరదని చెప్పాలి. గ్రామంలోని శివాల యంలో అద్భుత శిల్పకళ కళ్లను కట్టేస్తుంది. మరీ ముఖ్యంగా నదికి ఆవల వైపు గుట్టపైగల శ్రీ ఉమామహేశ్వరస్వామి, శ్రీ చెన్నకేశవస్వామి ఆలయాల గోడలపై గల శిల్పకళా విన్యా సాన్ని చూడడానికి నిజంగా రెండు కన్నలూ చాలవంటే అతిశ యోక్తి కాదు. జిల్లాలోని మిగతా చాలా దేవాలయాల్లో కూడా కళ్లు చెదిరే శిల్ప సంపద ఉన్నా, పూర్తిస్థాయి పనితనం గల శిల్పాలకు పుష్పగిరి ఆలయాలు నిలయంగా అలరా రుతున్నాయి. గోడలపైనే గాక, పునాది మొదట్లో కనిపించే నిర్మాణం నుంచి పైకప్పు వరకూ సెంటీమీటరు స్థలం కూడా ఖాళీగా కనిపించకుండా చిన్న పెద్ద శిల్పాలలు కనువిందు చేస్తాయి. శ్రీకృష్ణ దేవరాయల కాలం నాటి శిల్పకళా వైభవాన్ని ఈ ఆలయాలపై చూడవచ్చు. ఒక్కో ఆలయం చుట్టూ ఒకే డిజైన్‌ను చివరి వరకూ అచ్చుపోసినట్లు కనిపించేలా తీర్చిదిద్ది శిల్పి తన కళాచాతుర్యాన్ని చాటుకున్నట్లుగా కనిపిస్తోంది. తల ఒకటే వుండి, దానికి ఆవు, ఏనుగు శరీరాలున్నట్లు కనిపింప చేసే చమత్కార శిల్పాలను సైతం ఇక్కడ మనం చూడవచ్చు. తెల్ల శానపరాయిలో మలచిన ఈ శిల్పాలు వెన్నతో చేసినట్లుగా అద్దంలో చూసుకుంటున్నామా? అని భ్రమింపచే సేలా పలు శిల్పాలలో మన ప్రతిబింబాన్ని చూసుకోవచ్చు. దేశ విదేశీ పర్యాటకులు ఈ శిల్ప సౌందర్యాన్ని తిలకించి అబ్బురపడుతూ వుంటారు. ఈ రెండు ఆలయాలపై ఉన్న శిల్ప సంపదను పూర్తిగా చూస్తే 'విందు భోజనం' చేసినంత తృప్తిగా ఉంటుంది.



**పర్యాటక కేంద్రంగా... :** పలు విశిష్టతలుగల పుష్పగిరి క్షేత్రం జిల్లాలోని ప్రముఖ పర్యాటక ప్రాంతంగా పేరుగాంచింది. ఇక్కడి పెన్నా నదిలో స్నానం చేసి గుట్టపైగల శ్రీ చెన్నకేశవ, ఉమామహేశ్వరులను దర్శించుకుని, ఆ తర్వాత పుష్పగిరి గ్రామంలోని శివాలయాలనూ, ఆలయంలోని దేవ వైద్యుడు 'ధన్వం తరి'ని దర్శించుకుంటారు. ఈ క్షేత్రానికి నిత్యం అటు భక్తులూ, ఇటు పర్యాటకుల తాకిడి ఉంది. రాష్ట్ర ప్రభుత్వం వైఎస్ఆర్ జిల్లాకు సంబంధించి రూపుదిద్దుతున్న రెండు పర్యాటక సర్క్యూట్‌లలో పుష్పగిరి ఉండ టం విశేషం. కార్తీక మాసంలో ముఖ్యంగా కార్తీక సోమవారాల్లో నదీస్నానం చేసేందుకు భక్తులు పెద్ద ఎత్తున పుష్పగిరికి వస్తారు.

**వెళ్లాల్సిందిలా... :** కడప నగరం నుంచి పుష్పగిరి 14 కి.మీ దూరంలో ఉంది. కడప నగరం నుంచి డబుల్ ట్రిప్ ఆర్టీసీ బస్ సౌకర్యం ఉంది. కార్లు, వ్యాన్‌లు, ఆటోల సౌకర్యం కూ డా ఉంది. కడప నగరం నుంచి చెన్నూరుకు వెళ్లే హైవేలో 7 కి.మీ తర్వాత పడమటి వైపున వుంది. పెన్నాలో ప్రవాహం ఎక్కువగా ఉంటే గుట్ట నుంచి గ్రామానికి వెళ్లడం కష్టం. అందుకే నదిపై వంతెన ఏర్పాటు చేయాలని జిల్లా వాసులు, పర్యాటకులు కోరుతున్నారు. ఎన్నో ప్రత్యేకతలతో అద్భుత శిల్ప కళా నిలయంగా విలసిల్లుతు న్న పుష్పగిరి దివ్యక్షేత్రాన్ని తప్పక దర్శిం చుకోవాలి.



# గ్రంథాలయోద్యమ పితామహుడు గాడిచర్ల హరిసర్వోత్తమ రావు



"వందేమాతరమనగానే వచ్చితీరు ఎవనిపేరు?
వయోజన విద్య అనగనే వచ్చి తీరు ఎవరి పేరు!
గ్రామ గ్రామమున వెలసెడి గ్రంథాలయ మెవనికి గుడి?
అరగని తరగని వొడవని అక్షర దానం బెవనిది?
అరువదేండ్లు ప్రజలకొరకు అరిగిన కాయం బెవనిది?
తన బరువును మోయలేని తనువునుచాలిం చెనెవడు?
తరతరాలు ఎవనిమేలు తరలుచు పొరలుచు నుండును?
అందరికెవనితో పొత్తు - అఖిలాంధ్రబెవని సొత్తు
ఏస్థాన కవిని నేనో, ఆస్థానా దీశుడెవడు?
వయోవృద్ధుడగు యువకుడు వాస్తవ జీవిత మతనిది
హరిసర్వోత్తముడాతడు ఆంధ్రులపాలిటి దేవుడు"

**- కాళోజి నారాయణరావు**

ఆంధ్రదేశంలో స్వాతంత్ర్యోద్యమ వైతాళికులుగా, ప్రప్రథమ ఆంధ్ర రాజకీయ ఖైదీగా నిస్వార్థ నిరాడంబర ప్రజా సేవకులుగా విద్యావేత్తగా, తాగ్యమూర్తిగా విఖ్యాతులైన దేశభక్తులు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు.

లోకమాన్య బాలగంగాధర తిలక్, బిపిన్ చంద్రపాల్ గార్లచే ప్రభావితులైన గాడిచెర్ల విద్యార్థి దశలోనే, స్వరాజ్యోద్యమంలో సమరోత్సాహంతో పాల్గొని యువతనుత్తేజ పరిచిన దేశభక్తులు.

ఆయన జననం 14-9-1883. వారి పూర్వీకులు కడప జిల్లా సింహాద్రిపురం గ్రామానికి చెందినవారు. రావుగారు పుట్టింది కర్నూలులో. కర్నూలు, గుత్తి, నంద్యాలలో ఉన్నత పాఠశాల విద్య పూర్తిచేసి, మద్రాసు క్రైస్తవ కళాశాలలో విద్యార్థి వేతనం పొంది 1906లో ఎంఏ డిగ్రీ సంపాదించారు. ఉపాధ్యాయ శిక్షణ నిమిత్తం 1907లో రాజమండ్రిలోని టీచర్స్ ట్రైనింగ్ కాలేజీలో ఎల్‌టీ చదువుతుండగా స్వరాజ్యోద్యమంలో దూకారు.

## ప్రభుత్వ ఆంక్ష

భారత స్వాతంత్ర్యోద్యమ త్రిమూర్తులు (లాల్, బాల్, పాల్)లో ఒకరైన బిపిన్ చంద్రపాల్, రాజమండ్రి వచ్చి అక్కడ చేసిన ఉపన్యాసప్రభావం కాలేజీ విద్యార్థులపై పడింది. విద్యార్థులు 'వందేమాతరం' బ్యాడ్జిలతో క్లాసుకు వెళ్లారు. ప్రిన్సిపల్ మార్క్ హంటర్ బిళ్లలు తీసివేస్తే కాని క్లాసులకు రానివ్వనని విద్యార్థులకు ఆదేశాలు పంపారు. అందుకు విద్యార్థులు తిరస్కరించారు. విద్యార్థి నాయకుడైన సర్వోత్తమరావును కాలేజీ నుంచి డిస్మిస్ చేశాడు ప్రిన్సిపాల్. ఆయన కెక్కడా ఉద్యోగమివ్వరాదని ప్రభుత్వం ఉత్తర్వు ఇచ్చింది. రావుగారి జీవితంలో ఇదో పెద్ద మలుపు.

## స్వరాజ్య పత్రిక

జాతీయోద్యమ ప్రచారానికి పత్రికలు ప్రధాన సాధనాలని విశ్వసించి శ్రీరావు 1908లో బోడి నారాయణరావు (ప్రచురణకర్త) సహకారంతో 'స్వరాజ్య' తెలుగు వారపత్రికను ప్రారంభించారు. తెల్లదొరల అక్రమ, అన్యాయ చర్యలను తీవ్రంగా విమర్శిస్తూ రావుగారు వ్యాసాలు రాసేవారు.

## కారాగార శిక్ష

1908లో తిరునల్వేలిలో ఆష్ అనే ఆంగ్లేయ అధికారిని విప్లవకారులు కాల్చి చంపారు. ప్రజోద్యమాన్ని అణచివేసేందుకు పోలీసులు జరిపిన కాల్పుల్లో ముగ్గురు అమాయకులు ప్రాణాలు కోల్పోయారు. రావుగారు 'విపరీతబుద్ధి' అన్న శీర్షికతో సంపాదకీయం రాస్తూ అధికారుల దమనకాండను తీవ్రంగా ఖండించారు. రావుగారికి, రాజద్రోహ నేరంపై మూడేళ్ల కఠిన కారాగార శిక్ష విధించింది ప్రభుత్వం. నాటి జైలు జీవితానుభవాలను దర్శి చెంచయ్య "నేనూ-నాదేశం' అన్న గ్రంథంలో ఇలా చిత్రించారు.

'ఎంఏ పట్టభద్రులైన సర్వోత్తమరావును వెల్లూరు సెంట్రల్ జైలులో బందిపోటు దొంగలు, హంతకులున్న గదిలో వేశారు. మానరక్షణకు రెండు గోచిలిచ్చారు. మూరెడు చదరంగల రెండు తువ్వాళ్లు, పడుకునేందుకు చిన్న ఈత చాప, అన్నం తినడానికి మట్టి చట్టి, నీళ్ల తాగడానికి మట్టిముంత, మలమూత్ర విసర్జనకు మరొక మట్టి చట్టి ఇచ్చారు. కాలికి లావాటి కడియం, మెడకు మరో కడియం వేసి ఒక కొయ్యముక్కను వీటిలో దూర్చారు. మొలతాడు, జందెం తీసివేశారు. తలబోడి చేయించారు... రాగి సంకటి ముద్ద, దానిలో రాళ్లు, పుల్లలు, పురుగులు తేలుతుండేవి. ఈ తిండిలో మూడేళ్లు జీవించారు. గవర్నర్ జైలుని చూసేందుకు వచ్చినప్పుడు, తనను మానవమాత్రునిగా చూడమని కోరగా, ఆ దుర్మార్గుడు రావుగారిని దుర్భాషలాడి వెళ్లిపోయాడు.' ఈ విధంగా అష్టకష్టాలను స్థిర చిత్తంతో ఎదుర్కొన్న స్వాతంత్ర్య

సమరయోధులు గాడిచర్ల. 1914లో తిలక్, అనీబిసెంట్ స్థాపించిన 'హోమ్ రూల్ లీగ్' ఆంధ్ర శాఖకు కార్యదర్శిగా ఉండి, రాష్ట్రమంతటా పర్యటించి తమ అనర్గళ ప్రసంగాలతో ప్రజలను ఉత్తేజితులు చేశారు.

## స్వరాజ్య పార్టీలో చేరిక

1923లో చిత్తరంజన్ దాస్, మోతీలాల్ నెహ్రూ నెలకొల్పిన స్వరాజ్య పార్టీలో చేరారు రావుగారు. 1924 జనవరి 1, 2 తేదీల్లో కాకినాడలో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ మహాసభల్లో, స్వయం సేవకుల సంస్థ 'హిందూస్థానీ సేవాదళ్' స్థాపనలో రావు ప్రముఖ పాత్ర వహించారు.

1927లో రావు, ఆంధ్ర కాంగ్రెస్ అభ్యర్థిగా నంద్యాల నియోజకవర్గం నుంచి మద్రాస్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు జరిగిన ఎన్నికలో జస్టిస్ పార్టీ అభ్యర్థిని ఓడించి ఎన్నుకున్నారు. ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేట్ మెంబరుగా పనిచేశారు.

కొమర్రాజు వెంకట లక్ష్మణరావు ప్రారంభించిన విజ్ఞాన చంద్రిక గ్రంథమండలి కార్యదర్శిగా, ఆ సంస్థ నుంచి వెలువడిన మొదటి గ్రంథం, 'అబ్రహం లింకన్' జీవిత చరిత్ర రాశారు. గ్రీస్ దేశ చరిత్ర, విస్మృత కవిసార్వభౌముడు తదితరగ్రంథాల నెన్నింటినో రాశారు. 'శ్రీరామ చరిత్ర'కు వ్యాఖ్య రాశారు. రాజ కీయ, ఆర్థిక, సామాజిక సాంస్కృతిక కార్యక్రమాల్లో పాల్గొం టూ వందలాది వ్యాసాలు రచించారు. విద్యార్థి దశలోనే రాజమండ్రిలో 100 మందితో వయోజన విద్యాకేంద్రం నడిపా రు. రైతు సంక్షేమానికి పాటు పడ్డారు. పంచాయతీ మహాసభ, సహకార సభ, హిందీ మహాసభ, ఉపాధ్యాయ మహాసభ వంటి ఎన్నో సభలకు అధ్యక్షత వహించారు. మద్రాసులో పాకీ పని వార్ల సంఘానికీ, ప్రెస్ వర్కర్ల సంఘానికి అధ్యక్షుడిగా ఉండేవారు. 1930లో రాజకీయ రంగం నుంచి క్రమంగా వైదొ లగి, గ్రంథాలయోద్యమం, వయోజన విద్యా రంగాల్లో జీవిత మంతా గడిపారు. 1934 నుంచి జీవితాంతం దాక ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ అధ్యక్షుడిగా ఉండేవారు. గ్రంథాలయ కార్యకర్తలకు, వయోజన విద్యా బోధకులకు ఉపయుక్తమైన రచనలెన్నో చేశారు. ఎన్నో శిక్షణ శిబిరాలను నిర్వహించారు. భారత వయోజన విద్యా సంఘంలోనూ, అంతర్జాతీయ వయోజన విద్యా మహాసభలోనూ ప్రముఖ పాత్ర వహించారు.

ఆంధ్ర రాష్ట్ర స్థాపనకు అవిశ్రాంతంగా కృషి చేసి, ఆంధ్ర ప్రజలందరినీ సమైక్యపరిచి ఆంధ్రప్రదేశ్ అవతరణను చూశారు. 1950లో మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం రావుగారిని, ఆంధ్రప్రాంత వయోజన విద్యా గౌరవ డైరెక్టర్‌గా నియమించింది. 1952లో గాడిచర్ల బళ్లారి జిల్లాలోని (అవిభక్త మద్రాసు రాష్ట్రం) కన్నడ తాలూకాల్లో పర్యటించినప్పుడు, వారి తెలుగు ప్రసంగాలను కన్నడం చేసే అదృష్టం నాకు కలిగింది. పగటి పూట గ్రామ పంచాయతీలను, గ్రంథాలయాలను దర్శించేవారు. రాత్రివేళల్లో వయోజన విద్యా కేంద్రాలను దర్శించేవారు. వారి అవిశ్రాంత కృషి ఆదర్శవంతం.

## కళలకు ప్రోత్సాహం

సామాన్య ప్రజల్లో కళల పట్ల, సాహిత్యం పట్ల అభిరుచి పెంచేందుకు నాటకోత్సవాలను జరిపారు. కృష్ణదేవ రాయ జయంత్యుత్సవాలను జరిపారు. 1928లో నంద్యాలలో సర్వేపల్లి రాధాకృష్ణన్ అధ్యక్షతన జరిగిన ఆంధ్ర మహాసభలో, దత్తమండలాన్ని 'రాయలసీమ'గా నామకరణం చేసినది చిలుకూరి నారాయణరావుగారు అయితే దానిని విస్తృతంగా ప్రాచుర్యంలోకి తీసుకువచ్చింది గాడిచర్ల వారే! శ్రీరావు ఆంధ్ర పత్రిక సంపాదకులుగా కొంత కాలం పనిచేశారు. తాడిపత్రిలో 'మాతృసేవ' పత్రిక స్థాపనకు సంకటి కొండారెడ్డిని ప్రోత్సహించారు. కైవ సుబ్రహ్మణ్యశర్మ (నంద్యాల)తో పాటు 'కౌమోదకి' పత్రిక స్థాపించారు. ఆయుర్వేద వైద్య ప్రచారం చేశారు.

బీద కుటుంబంలో పుట్టిన ఆయన ఏనాడూ, ఏ పదవికీ పాకులాడలేదు. 'హిందూ' పత్రికకు సమీక్షలెన్నో రాశారు. ఆ విధంగా తమకు కావాల్సిన పైకాన్ని సమకూర్చుకునేవారు. ఎవరినీ యాచించని ఆత్మధనులాయన.

## గాంధీజీ ప్రశంస

తాము నమ్మిన సిద్ధాంతాల పట్ల అచంచల విశ్వాసం గలవారు, గాంధీజీనే విమర్శించినప్పుడు, 'ద బ్రేవ్ హరిసర్వోత్తమరావు' అన్నారు గాంధీజీ.

వృద్ధాప్యం పైబడినా, తమ పనులను తాము చేసుకునేవారు. అనంతపురంలోని వయోజన విద్యా కేంద్రాన్ని దర్శించేందుకు వచ్చినప్పుడు (1956లో) వారు వేకువనే లేచి వాహ్యాళి వెళ్లారు. అదివరకే వారితో నాకున్న పరిచయంతో, వారి పడకను దులిపి చుట్టిపెట్టాను. వచ్చిన వెంటనే నన్ను పిలిచి 'నా పడక ఎందుకు చుట్టావ్. నా పని నేనే చేసుకోవాలి. నన్ను త్వరగా చావమంటారా?' అన్నారు. క్షమించమన్నాను.

నిరంతర శ్రమవల్ల వారి ఆరోగ్యం దెబ్బతినింది. మద్రాస్‌లోని గోపాలపురంలో ఉన్న కూతురు, భార్య ద్వారకాబాయి, అల్లుడు పార్థసారథితో ఉండిపోయారు. రావు వైద్య సేవల కోసం చివరి దశలో గోవింద వల్లభపంత్ 2 వేల రూపాయలు పంపారు. అంతే వారందుకున్న ప్రతిఫలం.

గాడిచర్ల వారి సేవలకు చిహ్నంగా విజయవాడలో (పటమట) సర్వోత్తమ భవనం నిర్మించారు. పాతూరి నాగభూషణం ఈ స్మారక భవన నిర్మాణానికి కెంతో కృషి చేశారు.

త్యాగం, సేవ, దీక్ష తదితర గుణాలకు మూర్తిగా వెలిగిన 'ఆంధ్ర తిలక్' గాడిచర్ల హరిసర్వోత్తమరావు 1960 ఫిబ్రవరి 29న మద్రాస్‌లో కన్నుమూశారు.

'నిజానికి ఆనాడు ఆంధ్రలో హరిసర్వోత్తమరావు జన్మించి ఉండకపోతే రాజకీయోద్యమానికి పునాదియే లేకపోయి ఉండేది. ఆంధ్రలో రాజకీయాలకు ఆదిపురుషుడు హరిసర్వోత్తమ రావు' అన్న యర్రమిల్లి జగన్న శాస్త్రి పలుకులు అక్షరాలా నిజమైనవి.

**- జానమద్ది హనుమచ్ఛాస్త్రి**

పిల్లలను విద్యవైపు నడిపే అతి గొప్ప సాధనం చిత్రలేఖనం అని మనం మొదటి వ్యాసంలోనే తెలుసుకున్నాం. ఈ నైపుణ్యం జీవితంలో ప్రతి అడుగులోనూ ఉపయోగపడుతుంది. ఇప్పుడు కోరిలేషన్‌కి, చిత్రలేఖనానికి సంబంధం ఏమిటని మీకు సందేహం రావాలి.

అవును, చిత్రలేఖనానికి, సహసంబంధానికి ఒక అద్భుతమైన అనుబంధం ఉంది. ముందుగా మనం కొరిలేషన్ అంటే ఏమిటో తెలుసుకుందాం. ఒక సబ్జెక్టును ఇంకో సబ్జెక్టుతో అనుసంధానం చేసి, అభ్యసనాన్ని సులభతరం చేయడమే కొరిలేషన్. కొరిలేషన్ ప్రక్రియ ఆసక్తికరంగా సాగాలి అంటే రకరకాల ప్రయోగాలు చేయవచ్చు. ఈ ప్రక్రియను ఇంట్లో తల్లిదండ్రులు చేపట్టి, పిల్లలకు శిక్షణ ఇవ్వచ్చు. తర్వాత పిల్లలే ఈ విధానంలో అభ్యసించడానికి అలవాటు పడతారు. వారు సమకూర్చుకోగల వనరుల ఆధారంగా పాఠాలను అభ్యసిస్తారు. అదే పాఠశాలలో అయితే, ఒకే ఉపాధ్యాయుడు ఒక తరగతికి అన్ని సబ్జెక్టులు బోధించే అవకాశాలు ఇప్పుడు తక్కువ కనుక, ఈ తరహా బోధనను ఇతర సబ్జెక్టుల ఉపాధ్యాయులతో కలిసి ప్లాన్ చేయవచ్చు. కొలాబొరేటివ్ లెర్నింగ్ లా కొలాబొరేటివ్ టీచింగ్‌లో ప్రోగాలు చేయవచ్చు. ఉదాహరణకు ఒక నెల సిలబస్‌లో అన్ని సబ్జెక్టులనూ దగ్గర పెట్టుకుని, ఉపాధ్యాయులు కృత్యాలను పంచుకోవచ్చు. హ్యుటగాజీ అలవాటు అయిన తర్వాత పిల్లలే పథక రచన, కృత్యాల అమలుకు కృషి చేస్తారు కాబట్టి, శిక్షణ అనంతరం పని సులువు అయిపోతుంది.

ప్రతి సబ్జెక్టు నుంచి ఒక్కో అంశాన్ని తీసుకుని, వాటిని క్రోడీకరించి, కృత్యాలను చేయించాలి. ఇక్కడ వనరుల సమీకరణ చాలా ముఖ్యమైనది. అందుకే పిల్లలకు వనరుల సేకరణ విషయంలో శిక్షణ ఇవ్వాలి. అలాగే చిత్రలేఖనం నైపుణ్యాన్ని ఈ ప్రక్రియలో తప్పక ఉపయోగించాలి. ఉదాహరణకు, మనం తీసుకున్న అంశాలకు సంబంధించి ఒక కథ చెప్పుకోవచ్చు. మనం సగం చెప్పి, పిల్లలను పొడిగించమనవచ్చు. తర్వాత వారు సేకరించిన వనరులను ప్రదర్శించి, సంబంధిత అంశాలను వివరించమనాలి. క్లిష్టమైన అంశాలను మనం విశదపరచాలి. ఇలా ప్రదర్శన అనంతరం మనం చెప్పిన కథను చిత్రంగా నల్లబల్లపై కానీ, తెల్ల కాగితంపై కానీ గియ్యించాలి. ఈ పనిని పిల్లలు కలిసి చేయాలి.ఒక్కో గ్రూపు నుంచి ఒకరు లేదా ఇద్దరు చొప్పున ఈ పని చేయవచ్చు. చిత్రం పూర్తి అయిన తర్వాత పిల్లలతో మాట్లాడించి, వాక్యాలు రాయించి, వారే కృత్యాలు నిర్వహించేలా తర్ఫీదు ఇవ్వాలి.

# హ్యుటగాజీలో అతిముఖ్యమైన అంశం కోరిలేషన్ (సహ సంబంధం)






తర్వాతి రోజు ఈ కథను నాటకీకరణ చేయించాలి.

ఒక గ్రూపు, ఇంకో గ్రూపునకు ప్రాజెక్టు పనులు కేటాయిం చాలి. కృత్యాలు, ప్రాజెక్టు పనులు మూల్యాంకనం కూడా పిల్లలే చేయాలి. కాస్త బాగా అర్థం కావడానికి ఇది చూడండి. ఒక రోజు ఐదో తరగతిలో జరిగిన కొరిలేషన్ అభ్యాసన ప్రక్రియ :

ఈ రోజు 'టాయ్స్ డే' అంటే ఆట వస్తువుల రోజు.

ప్రతి విద్యా సంవత్సరం జూన్‌లో పిల్లలకు మొదటి టాయ్స్ డే రుచి చూపిస్తారు.

టాయ్స్ డే తర్వాత పిల్లల్లో చాలా మార్పు వస్తుంది.

బొమ్మలన్నీ చూస్తారు, వాటి గురించి స్వేచ్ఛగా మాట్లాడతారు. నచ్చిన వాటిని తీసుకుని కథలు అల్లి చెప్తారు. ఇంకా చాలా ఉంటాయి. అప్పుడిక వాళ్ల సేకరణ మొదలవుతుంది. నాకు కథలకు, పాఠాలకు, చర్చలకు, ఆటలకు అన్నింటికీ ఈ కలెక్షన్ ఉపయోగపడుతుంది.

ఈరోజు పిల్లలకు బొమ్మలు ఇచ్చేసి నేను కూర్చున్నాను. ప్రస్తుతానికి ఉన్న క్లాస్ లీడర్ బొమ్మలను పేర్చడం మొదలుపెట్టాడు. పిల్లలంతా సర్కిల్‌లో కూర్చుని ప్రదీప్‌కి సలహాలు ఇవ్వడం మొదలుపెట్టారు. పిల్లలంతా సర్కిల్‌లో కూర్చుని ప్రదీప్‌కి సలహాలు ఇవ్వడం మొదలుపెట్టారు. చివరికి ఆ పేర్చడం ఒక మంచి కాన్సెప్ట్‌గా మారింది.

ఎత్తులో సింహాన్ని, పులిని పెట్టారు, మిగిలిన జంతువులు అన్నీ వాటి ఎదురుగా కింద నిలబడ్డాయి. అడవికి రాజు జంతువులను ఉద్దేశించి మాట్లాడుతున్నాడంట! ఇంకా ఏవేవో చెప్పారు.

కొంతసేపటి తర్వాత జూన్ నెల సిలబస్ దగ్గరికి వచ్చి ఆగాను.

'మనకు కొంత సిలబస్ అయింది కదా... ఒక్కో గ్రూపు ఒక్కో సబ్జెక్ట్ తీసుకోండి... కాన్సెప్ట్ తయారు చేయ్యండి అన్నాను.'

అంబేద్కర్ గ్రూపు ఇంగ్లీషు తీసుకుంది. పాఠం సిలబస్‌లో మొదటి రైం 'వేక్ అప్' పాఠ్యపుస్తకంలో ఉన్నట్లు వాళ్ల కాన్సెప్ట్ తయారు చేశారు (వాళ్లకు అవసరమైన వనరులు మన బొమ్మలనుంచి తీసుకున్నారు) ఫొటో చూడండి. వాళ్ల కాన్సెప్ట్ వివరించి, వెంటనే రైం పాడేశారు.

రుద్రమదేవి గ్రూపు తెలుగు తీసుకుంది. పాఠం సిలబస్‌లో మొదటి గేయం 'స్వతంత్రోద్యమం' మా బొమ్మల్లో మనుషులు తక్కువ ఉన్నారు. అందుకని వాళ్లు ఒక కథను కాన్సెప్ట్‌గా తీసుకున్నారు. ప్రదీప్ సాయంతో ఒక జైలు తయారు చేసి (అట్టతో) అందులో జంతువులను కొన్నింటిని పెట్టారు. ఒక ఎత్తైన ప్రదేశంలో పులిని నిల్చోబెట్టారు. పులి ఎదురుగా కొన్ని జంతువులను పడుకోబెట్టారు. విషయం ఏమిటని అడగ్గా, 'ఈపులి బ్రిటీష్ వాళ్లు, జైలులో ఉన్న జంతువులు మన దేశ నాయకులు. బయట పడి ఉన్న జంతువులు బ్రిటీష్ వాళ్లు చంపేసిన దేశ నాయకులు' అని చెప్పి, స్వతంత్రోత్సవం గేయాన్ని అభినయంతో ఆలపించారు. (ఇంకా పూర్తి గేయం వారికి రాలేదు) గాంధీజీ గ్రూపు సైన్సు తీసుకున్నారు. పాఠం సిలబస్‌లో మొదటి పాఠం 'జంతువులు మన జీవన విధానం వాళ్లు జంతువులపై మనం మేటి కోసం ఆధారపడుతున్నామో ఒక చార్ట్ తయారు చేసి (టెక్స్ట్‌బుక్‌లో ఉన్నదే) దాని ఆధారంగా ఒక్కొక్కళ్లు జంతువుల బొమ్మలు ఉపయోగించి చెప్పారు.

అల్లూరి సీతారామరాజు గ్రూపు నిన్నటి డ్రింకు చిప్పలతో (కూల్‌డ్రింక్ మూతలు) మన కలెక్షన్‌లో ఉన్న రెండు అయస్కాంతాల ప్రయోగం చేసి చూపించారు. డ్రింకు చిప్పలన్నీ కింద పోసి, పెద్ద అయస్కాంతాన్ని వాటిపైన తిప్పగానే ఆ మూతలన్నీ అయస్కాంతానికి అతుక్కుపోయా యి. అంతేకాక, ఆ మూతల మీద నిన్న మార్కర్స్‌తో అంకెలు రాశారు కదా! అవి పక్కన పెట్టి సంఖ్యలు చదివారు.

ఇంతే! దీన్నే నేను కోరిలేషన్ అని కూడా అంటాను.

**<u>ఇంకా అర్థం చేసుకునే ప్రయత్నం చేద్దాం :</u>**

ఉదాహరణకు గ్రహాలు, గ్రహణాలు అనండి...

ఇదొక సోషల్ పాఠమని఼ఠకీమని జవాబు వస్తుంది. మరి ఈ పాఠ్యాంశంలో సైన్స్, గణితం లేవా? ఇదొక సోషల్ పాఠమని ఠకీమని జవాబు వస్తుంది. ఇలా గ్రహణాల గురించి చెబుతున్నప్పుడు చంద్ర/సూర్య గ్రహణం ఎన్నాళ్లకోసారి ఏర్పడుతుందో చెబుతాం. అలా లెక్క కట్టడమెలాగో చెబుతాం. మరి అది గణితమే కదా! భూమి, సూర్యుడు, చంద్రుడు, మిగిలిన గ్రహాల గురించి బోధించడం సైన్స్, గ్రహణాలు ఏర్పడు విధానం గురించి చెప్పడం, వాటి చలనం గురించి బోధించడం సైన్స్. అలాగే వీటి పేర్లు చెప్పినప్పుడు అది భాష. మన తెలుగు పాఠాల్లో చూడండి, అన్ని పాఠ్యాంశాలూ ఉంటాయి. ఐదో తరగతి గణితంలో గోల్కొండ కోట విహారయాత్ర పాఠం ఒక కథగా సాగుతూ గణితంలోని కనీసాభ్యసన స్థాయిలను పూర్తి చేయడం ఒక ఉదాహరణగా చెప్పుకోవచ్చు. ఇలా ఒక్కో అంశాన్నీ గనుక అనుసంధానం చేస్తూ పాఠ్యాంశ బోధన సాగితే ఎంత బావుంటుంది! పాఠ్య పుస్తకాల్లో వచ్చిన మార్పు వల్ల ఇప్పుడు ఉపాధ్యాయులకు ఈ విధానం ఇంకా సులవుతుంది.

**<u>కొన్ని ఉదాహరణలు చూద్దాం :</u>**

నీరు- వ్యాసం మొదటల్లో చెప్పినట్లు కాకుండా, నీటితో ప్రయోగాలు చేయించి, వాటిని నమోదు చేయించండి. నీటి చలనానికి వర్షం వచ్చిన రోజు బావుంటుంది. వర్షం నీరు పారుతున్న విధానాన్ని చూపండి. మర్నాడు నీరు ఎక్కడెక్కడ ఎలా చలిస్తుందో చెప్పమనండి. చూడండి పిల్లలు ఎన్ని జవాబులు చెప్తారో! నీటిలో ఏఏ వాయువులు ఉంటాయో చెప్పండి. పిల్లలతో చెప్పించండి. రెండువాయువులు కలిసి ద్రవంగా ఎలా ఏర్పడిందో అడగండి. పాఠశాల, ఇళ్లల్లో పెంచే మొక్కలకు నీటికీ గల సంబంధం ఏమిటో అడగండి. వారు ఏమనుకుంటున్నారో చెప్పమనండి/రాయమనండి. నీటిలో ఉండే హైడ్రోజన్, ఆక్సిజన్ మనకు ఎలా లభిస్తాయో ప్రయోగం ద్వారా చూపండి. జంతువులకూ,

మానవులకూ నీటి అవసరం ఏమిటో చర్చించమనండి. నీటితో భూమికున్న అవసరాలు ఏమిటో రాయమనండి. ఇక నీటి పొదుపు ఆవశ్యకత వివరించమనండి. ఇదంతా అయ్యాక, మట్టితోఒక గ్రామాన్ని/అట్టలతో డయోరమా లాంటిదాన్ని తయారు చేయించండి. నీటి వనరులు ఆ నమూనాలో ఉండేలా చూడమనండి, పిల్లలందరూ చాలా ఉత్సాహంగా తయారు చేస్తారు. తెలుసుకున్న అంశాలన్నీ అందులో పొందుపరుస్తారు. తర్వాతి రోజు ఒక పట్టిక తయారు చేసి, ప్రాజెక్టు పని ఇవ్వండి. తను తమ ప్రాంతాల్లో పర్యటించి ఆ ప్రాజెక్టు పనిని పూర్తి చేయమనండి. అంతే! నీటికి సంబంధించిన ఎన్నో విషయాలు వారు తెలుసుకున్నట్లే! ఇందులో ఫిజిక్స్/కెమిస్ట్రీ/బయాలజీ చెప్పేసినట్లే కదా!

ఇదొక ఉదాహరణ మాత్రమే! పాఠాన్ని ఒక ఫిక్స్‌డ్ ఫ్రేమ్‌డ్ ఫ్రేమ్ వర్క్‌లోనే బోధించాలని లేదనీ, మన సృజనాత్మకత పరుగులు పెట్టినప్పుడు పిల్లల సర్వతోముఖాభివృద్ధి తథ్యమని మనకు ఇట్టే అర్థమవుతుంది!

**ఇలా కొరిలేట్ చేయడం వల్ల ప్రయోగాలు :**

- శాస్త్రీయమైన ఆలోచనా విధానం అలవడుతుంది.
- సమస్య సాధన దిశగా మెదడు వృద్ధి చెందుతుంది.
- పిల్లల ఐక్యూ పెరుగుతుంది.
- తార్కిక, హేతువాద దృక్పథాలు అలవడుతాయి.
- ఉపకల్పనలు, ప్రాక్కల్పనలు విషయంలో పరీక్షించే స్థాయికి ఎదుగుతారు.
- ఏవిషయాన్నైనా లోతుగా అధ్యయనం చేయడం నేర్చుకుంటారు.
- కనెక్టివిటీకి సంబంధించి ప్రతిసారీ ఆలోచిస్తారు.
- సబ్జెక్టును నేర్చుకునే విధానంలో మార్పు వచ్చినప్పుడు వారి సంగ్రహణా విధానంలో కూడా మార్పు వస్తుంది. అభ్యసన మరింత సులువవుతుంది.
- స్వయం కారణాలు, సంధానాలు చెప్పడం మొదలుపెడతారు. అలా చెప్పడమంటూ మొదలుపెడితే, ఇక మన కృషి ఫలించినట్లే!
- ఇలా కొరిలేషన్ పద్ధతిలో పాఠ్యబోధన జరిగినప్పుడు అన్ని పాఠ్యాంశాల్లోనూ విద్యార్థి ప్రతిభ మెరుగుపడుతుంది. (విద్యాపరమైన ప్రయోగాల్లో ఈ విషయం నిరూపించబడింది).
- పరిశీలన అన్వేషణ తదితర ఎన్నో గుణాలు పిల్లల్లో వృద్ధి చెందుతాయి.

**ఇవి చేయండి :**

- సమాచార సేకరణకు ఎక్కువ ప్రాధాన్యతనివ్వండి.
- ప్రెడిక్షన్ (ప్రతి విద్యార్థి చాలా విషయాలు తనకు అర్థమైనట్లుగా చెప్పలగడు. ఈ అంశానికి ప్రాధాన్యతనిస్తూ, కారణాలు చెప్పేందుకు అవకాశం ఇవ్వాలి)
- సీక్వెన్స్ (అనుక్రమం) - ముందుగా అనుకున్న విషయాన్ని చెప్పి/చేసి తదుపరి సంబంధిత అంశాలతో అనుసంధానం చేస్తూ చేయించడం/చెప్పించడం చేయాలి. అందువల్ల విద్యార్థుల్లో కన్ఫ్యూజన్‌కు దారి ఉండదు. అంతేకాక ఒక పద్ధతిలో చెప్పడం/చెయ్యడం అలవడుతుంది.
- కంపేరిజన్ (పోలిక) పోలికలు చెప్పించాలి.
- ఈ విధానంలో తాము ఎందుకు పాఠ్యాంశాన్ని అభ్యసిస్తున్నామో విద్యార్థులకు తెలియాలి.
- ఫ్యాక్ట్స్ (వాస్తవాలు) ప్రయోగం/ప్రాజెక్టు/నాటకం/కథ మొదలైనవి శాస్త్ర వాస్తవాలను తెలియజేయాలి.

**పథకరచన :**

- ఇలా పాఠ్యబోధన జరగాలంటే ఉపాధ్యాయుని సంసిద్ధత చాలా ముఖ్యం.
- అన్ని పాఠ్యాంశాలనూ ముందుగా అవగాహన చేసుకోవాలి.
- కొరిలేట్ చేయదగ్గ అంశాలను విభజించుకోవాలి.
- తగిన బోధనాభ్యసన సామగ్రిని తయారు చేసుకోవాలి. (నేను అప్పటికప్పుడు టిఎల్ఎం తయారు చేస్తాను. అది కూడా విద్యార్థుల సహకారంతోనే! ఒక్కోసారి అవసరమైన సామగ్రి తయారీని గ్రూపులకు హోం వర్క్‌గా ఇస్తాను. వారు ఆ సామగ్రిని తయారు చేసి తీసుకురావాలంటే తగిన వనరులు సమకూర్చుకోవాలి. అలాగే టీం అంతా ఒకచోట చేరి ఆ చార్టు/నమూనా/బొమ్మ మొదలైనవి చేసి తీరాలి. ఇలా టీం వర్క్ పెంపొందుతుంది. వనరులను సమకూర్చుకోవడం తెలుస్తుంది.)

**బోధనాభ్యసన ప్రక్రియ :**

సీక్వెన్షియల్ పద్ధతిలో పాఠ్యబోధన చేయాల్సి ఉంటుంది. ఒక అంశానికి ఇతర అంశాలను జోడించి చెప్పేటప్పుడు చాలా ఆసక్తికరంగా బోధించాలి.

బోధన పూర్తయ్యాక అటువంటిదే ఒక అంశాన్ని పిల్లలకు హోం వర్క్ గానో లేదా పాఠశాలల్లోనే చేయదగ్గ కృత్యంగా ఇవ్వాలి. ఇలా చేయడం వల్ల వాళ్లకు ఈ పద్ధతి అలవాటు అవుతుంది. కనెక్టివిటికి అలవాటుపడతారు.

**సమకూర్చుకోవాల్సిన వనరులు :**

- తగిన బోధనాభ్యసన సామగ్రి
- పాఠశాల ఆవరణ
- పర్యావరణ వినియోగం
- చక్కటి డిస్ప్లే బోర్డు/ ప్యానెల్ బోర్డు
- పిల్లల ఆసక్తి/ఉత్సాహం
- ఒక నమోదు పుస్తకం

ఈ ప్రక్రియ అలవాటు అయితే పిల్లలు ఇక వదలరు. సమయం ఎంతో ఆదా అవుతుంది. మొదట్లో కొరిలేషన్ శిక్షణ కొంచెం కష్టం అనిపించినా, తర్వాత ఉపాధ్యాయులు వట్టి ఫెసిలిటేటర్స్‌గా మాత్రమే వ్యవహరించడం వల్ల పిల్లల్లో అమోఘమైన అభివృద్ధి వచ్చి తీరుతుంది.

**విజయభాను కోటె, టీచర్, ఫ్రీలాన్స్ జర్నలిస్టు**

# ఆంధ్రప్రదేశ్ వివాహాల నిర్బంధ నమోదు చట్టం -2002

డాక్టర్ సుబ్రమణ్యం దాసరి
జిల్లా బాలల పరిరక్షణాధికారి
అనంతపురం




ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 2002 సంవత్సరంలో ఈ చట్టాన్ని రూపొందించింది. ఈ చట్టం ప్రకారం ఆంధ్ర రాష్ట్రంలో జరిగే అన్ని వివాహాలు తప్పనిసరిగా సంబంధిత స్థానిక సంస్థలచే (గ్రామ పంచాయతీలు, మున్సిపాలిటీలు, మున్సిపల్ కార్పొరేషన్లు) నమోదు చేయాలి. వివాహాన్ని నిరూపించడం కష్టమైనదని, రెండో వివాహాలను నిరోధించాలంటే జనన, మరణ నమోదులలాగే ప్రతి వివాహం కూడా రిజిస్టర్ కావాలని అప్పటి ఆంధ్రప్రదేశ్ మహిళా కమిషన్ అభిప్రాయపడింది. ఎక్కువ సందర్భాల్లో అధిక శాతం మహిళలే మోసాలకు గురవుతున్నారని, వివాహం నమోదు కాకపోవంతో చాలా మంది తేలికగా భార్యలను విడిచిపెట్టి రెండో పెళ్లికి సిద్ధమై పోతున్నారని, కారణం చేత కొంతమంది మహిళలు ఆత్మహత్యలకు గురవుతున్నట్లు, మరికొంతమంది భర్తల ప్రవర్తనతో నరకయాతన పడుతున్నట్లు కమిషన్ గుర్తించింది. ఈ నేపథ్యంలో వివాహ బంధానికి చట్టబద్ధమైన హెూదా కల్పించి, నిశ్చయాత్మకమైన సాక్ష్యాధారాలతో వివాహ వ్యవస్థను బలపరిచి తద్వారా మహిళలకు భరోసా కలి&ంపచేందుకు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర మహిళా కమిషన్ అన్ని వివాహాలను స్థానిక సంస్థలచే నిర్బంధంగా నమోదు చేయించేందుకు ప్రభుత్వానికి సిఫారసు చేసింది.

ఆంధ్రప్రదేశ్ మహిళా కమిషన్ చేసిన ప్రతిపాదనలను ప్రభుత్వం నిశితంగా పరిశీలించిన తరువాత వివాహాలను స్థానిక సంస్థలచే నిర్బంధ నమోదు చేయడం రాష్ట్రంలో అత్యవసరమని భావించి చ్టం తయారు చేసి 2002 అక్టోబర్ 10న ఈ చట్టాన్ని అమలులోకి తీసుకునివచ్చింది. ఈ చట్టాన్ని ఆంధ్రప్రదేశ్ వివాహాల నిర్బంధ నమోదు చట్టం-2002గా వ్యవహరిస్తారు. ఈచట్టంలో నాలుగు అధ్యాయాలు ఉన్నాయి. మొదటి అధ్యాయంలో ప్రారంభిక - నర్వచనాలు, ఉపోద్ఘాతం గురించి, రెండో అధ్యాయంలో వివాహాల నమోదు చేసే విధానం గురించి, మూడో అధ్యాయంలో శిక్షార్హతల గురించి, నాల్గవ అధ్యాయంలో జంటలకు వివాహ ధ్రువపత్రం మంజూరు వంటి విషయాల గురించి చెప్పబడింది.

ఈ చట్టం అమలులోకి వచ్చిన తరువాత రాష్ట్రంలో జరిగిన అన్ని వివాహాలు తప్పనిసరిగా సెక్షన్-8 ప్రకారం నమోదు చేయాలి. ఇతర సొంత మతాచార శాసనాల ప్రకారం వధువు, వరుడు లేదా ఆచారాలు, సంప్రదాయాల ప్రకారం వివాహాల నమోదు చేసి ఉన్నప్పటికీ ఈ చట్టం కింద నమోదు చేయాలి.

వివాహాల రిజిస్ట్రేషన్ కోసం రాష్ట్ర ప్రభుత్వం వివాహాల రిజిస్ట్రార్ జనరల్‌కు నియామకం చేయవచ్చు. రాష్ట్ర ప్రభుత్వం ప్రతి జిల్లాలోనూ వివాహాల రిజిస్ట్రార్‌లను, డిప్యూటీ రిజిస్ట్రార్‌లను నియమించింది. వివాహాల జిల్లా రిజిస్ట్రార్ జిల్లాలో జరిగే అన్ని వివాహాలను నమోదు చేయడంలో, రిజిస్ట్రార్ జనరల్ నిర్దేశాలను పర్యవేక్షించి అమలు చేయడంలో, జిల్లాలో ఈ చట్టం అమలు చేయడంలో కాలానుగుణంగా రిజిస్ట్రార్ జనరల్ జారీ చేసిన ఉత్తర్వులు అమలు చేయడంలో అనువర్తిస్తుంటాడు. ఈ చట్టం కింద పంచాయతీ సెక్రటరీ, మున్సిపల్ కమిషనర్‌లు వివాహ అధికారులుగా నియమించారు.

**వివాహ మెమొరాండం :** వివాహ కక్షిదార్లు, వధువైనా, వరుడైనా లేదా వారి తల్లిదండ్రులు లేదా సంరక్షకులు నిర్ధారిత ఫార్మ్‌లో షెడ్యూల్‌లో సదరు వ్యక్తి సంతకంతో పెళ్లయిన 30 రోజు

ల్లోగా వివాహ అధికారికి వివాహం గురించి తెలియజేయాలి. వివాహ అధికారి ఎదుట వధూవరుల ఇరు పక్షాన ఇద్దరు సాక్షులు మెమొరాండంలో వధూవరులతో పాటు సంతకం చేయాలి. సెక్షన్ 8లోని ఉప సెక్షన్ (1) ప్రకారం 30 రోజుల సమయం ముగిసిన తరువాత వివాహ విషయాన్ని మెమొరాండం ద్వారా తెలియజేస్తే 60 రోజుల లోపుగా 100 రూపాయల చెల్లింపుతో స్వీకరిస్తారు.

**శిక్షలు :** ఈ చట్ట ప్రకారం ఏ వ్యక్తయినా ఉద్దేశపూర్వకంగా తెలిసీ తప్పుగా వివరాలు నమోదు చేసినట్లు రుజువైతే ఏడాది పాటు కారాగార శిక్ష లేదా వెయ్యి రూపాయల జరిమానా లేదా రెండింటినీ కలిపి శిక్షగా విధించవచ్చు. బుద్ధిపూర్వకంగా వివాహం నమోదును నిర్లక్ష్యం చేసినా లేదా నివారించినా సెక్షన్ 8,9 ప్రకారం వెయ్యి రూపాయల జరిమానా విధించవచ్చు.

- ఏ వివాహ అధికారి అయినా వివాహం నమోదు చేయడంలో విఫలమైతే సెక్షన్ 8 ప్రకారం 3 నెలల జైలు శిక్ష లేదా 500 రూపాయల జరిమానా లేదా రెండింటినీ కలిపి విధించవచ్చు.
- ఈ చట్టం పరిధిలో నేరం జరిగితే ఫస్ట్ క్లాస్ జుడిషియల్ మెజిస్ట్రేట్ సీఆర్‌పీసీ 1973కు లోబడి విధానాలతో విచారించవచ్చు.
- వివాహం నమోదు కాగానే వివాహాధికారి ఉచితంగా జంటకు వివాహ ధ్రువపత్రాన్ని స్వయంగా అధికారిక ముద్రతో అందిస్తాడు. ఈ ధ్రువపత్రం వివాహం జరిగిందన్న విషయాన్ని నిశ్చయాత్మక సాక్ష్యంగా నిలుస్తుంది.

**ఆంధ్రప్రదేశ్ వివాహాల నిర్బంధ నమోదు చట్టం నియమాలు :** ఈ చట్టానికి సంబంధించిన నియమాలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జీఓఎంఎస్ నెం.35, మహిళాభివృద్ధి శిశు సంక్షేమం, వికలాంగుల సంక్షేమం శాఖ వారు 24-9-2003న నియమాలను రూపొందించారు.

- హిందూ వివాహం చట్టం 1955, ప్రత్యేక వివాహాల చట్టం 1954, భారతీయ క్రైస్తవ వివాహ చట్టం 1872, పార్శీ వివాహం విడాకుల చట్టం 1936 ప్రకారం అధీకృత అధికారులు వివాహాలను నమోదు చేసుకోవచ్చు.
- వివాహాల మెమొరాండంను ఫార్మ్ 'బి'లో ఉంచాలి. ఫార్మ్ (బి) మీద వధూవరుల పాస్‌పోర్టు సైజు ఫొటో అతికించాలి.

**వివాహాల రిజిస్ట్రార్ జనరల్ విధులు : ఈ చట్టం ప్రకారం...**

- జిల్లా వివాహ రిజిస్ట్రార్లు, వివాహ అధికారులు విధి నిర్వహణ నియంత్రణ, అజమాయిషీ చేయడం, తనిఖీ చేయడం.
- వివాహ నమోదు రిజిస్టర్‌ల నిర్వహణను పరిశీలించడం.
- రాష్ట్రంలోని రిజిస్ట్రేషన్ కార్యాలయాలను తనిఖీ చేసి చట్టంలోని సదుపాయాల అమలుకు కావాల్సిన నిర్దేశాలను జారీ చేయడం.
- చట్టంలోని సదుపాయాలను వర్తింపచేసేందుకు జిల్లా రిజిస్ట్రార్‌లకు అధికారాలను ఇవ్వడం.
- జిల్లా వారిగా వివాహ నమోదు వివరాలను సమగ్రీకరించి, వివరాలను సంవత్సరానికొకసారి నివేదికను ప్రభుత్వానికి నివేదించడం.



**వివాహాల రిజిస్ట్రార్‌ల విధులు :**

- వివాహ రిజిస్ట్రేషన్ కార్యాలయాలను తరచుగా తనిఖీ చేసి తగిన నిర్దేశాలను జారీ చేస్తుండటం.
- తన పరిధిలో ఉన్న వివాహ అధికారుల నుంచి త్రైమాసిక, సంవత్సరాంతపు రిజిస్టర్లను సమీగ్రకరించి వివాహాల రిజిస్ట్రార్ జనరల్‌కు దాఖలు చేయడం.

**వివాహ అధికారుల విధులు :**

- నియమాల్లో సూచించిన రిజిస్టర్‌లను నిర్వహిస్తూ ఎప్పటికప్పుడు అప్‌డేట్ చేయడం.
- నెలసరి నివేదికలను తయారు చేసి జిల్లా వివాహాల రిజిస్ట్రార్‌కు నివేదించడం.
- సెక్షన్ 18 ప్రకారం రిజిస్ట్రార్ అనుమతితో విచారణ నిర్వహించడం.
- వివాహ ధ్రువపత్రం అధికారిక ముద్రతో జారీ చేయడం.

ఈ చట్టం అమలులోకి వచ్చి సుమారు పదిహేను సంవత్సరాలు పూర్తి కావస్తోంది. చట్టం ప్రకారం రాష్ట్రంలో జరిగే వివాహాలు ముఖ్యంగా ఈ చట్టం అమలులోకి వచ్చినప్పటి నుంచీ జరిగిన అన్ని వివాహాలు తప్పనిసరిగా నిర్బంధంగా నమోదు చేయాలి. ఈ నమోదు బాధ్యత స్థానిక సంస్థలకు, బాల్య వివాహ నిరోధక చట్టం 2006 ప్రకారం బాల్య వివాహ నిరోధక అధికారులు నియమించిన వారికి ఇచ్చారు. విచిత్రం ఏమిటంటే చాలా మటుకు వివాహాలు నమో దు కావడం లేదు. చాలా తక్కువ శాతం మంది మాత్రమే వివాహాలు నమోదు చేయించుకుంటున్నారు. బాగా చదువు కున్న వారు కూడా వివాహం నమోదు చేసుకోవడం లేదు. దీనికి స్థానిక సంస్థలు, సంబంధిత ప్రభుత్వ అధికారులు పాక్షికంగా బాధ్యులయినప్పటికీ సమాజంలోని ప్రతి ఒక్కరూ ఇందుకు బాధ్యులే. ప్రజలలో అవగాహన పెంచి ప్రతి వివాహం నమోదు అయ్యేలా చూడాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ముఖ్యంగా ప్రభుత్వ శాఖలు స్వచ్ఛంద సంస్థలు, మహిళా సంఘాలు, స్వయం సహాయక బృందాలు, వలంటీర్లు ప్రతి ఒక్కరూ తన వంతు సహకారంతో వివాహాల నిర్బంధ నమోదు గురించి అందరికీ తెలియజేస్తూ అన్ని వివాహాలు నమోదయ్యేలా కృషి చేద్దాం!

# సింగమనేని నారాయణ కథల్లో

# రైతుల ఆత్మహత్యలపై ఓ పరిశీలన

**కే వెంకటచలపతి, ఎంఫిల్ విద్యార్థి, తెలుగు మరియు తులనాత్మక శాఖ, ఎస్కేయూ**

**సిం**గమనేని నారాయణ అనంతపురం పట్టణానికి దగ్గరలో ఉన్న మరూరు బండమీదపల్లి గ్రామంలో మధ్య తరగతి రైతు కుటుంబంలో 1943న జన్మించారు. తిరుపతి ఓరియంటల్ కళాశాలలో శిక్షణ పొందారు. గ్రామీణ ప్రాంతాల హైస్కూళ్లలో తెలుగు పండిట్‌గా పనిచేసి 2001లో పదవీ విరమణ చేశారు. ఈ జీవిత నేపథ్యం అయిన కథా సాహి త్యంలో కళాత్మకంగా ప్రాణం పోసుకుంది.

రాయలసీమలో ఆధునిక కథ, ఆ మాటకొస్తే, ఆధునిక మనదగ్గ సాహిత్యమంతా, సర్కార్ జిల్లాలతో నలభై ఏళ్లు ఆలస్యంగా మొదలైంది. రాయలసీమకు తొలి ఆధునిక కథకుడు కె. సభా. అనంతపురం జిల్లాకు సింగమనేని అలాంటివారు. అనంతపురం జిల్లాలో 1940 ప్రాంతంలో జీ రామకృష్ణ, చిలు కూరు నారాయణరావు, తూమాటి దొణప్ప కొన్నికథలు రాసినా, సలక్షణమైన ఆధునిక కథకు శ్రీకారం చుట్టిన వారు సింగమనేని. కథా వస్తు రూపాలను ఆయన ఉన్నతస్థాయికి చేర్చారు. మార్క్సిస్టు తాత్వికత ఆయన జీవితావగాహనను సంపన్నం గావించింది. ఆయన కథల్లో ఆ అవగాహన ప్రతిఫలించింది.

ప్రకృతి సహకరించక, వరుణుడి కరుణలేక ఏటికేడు కరువు రక్కసి కరాళ నృత్యం చేస్తున్న అనంతపురం జిల్లలోని రైతన్న దీనస్థితి. తలుచుకునే కొద్దీ శరీరంలో ప్రకంపనలే. అటువంటి గడ్డపై పుట్టుకొచ్చిన కథకుడు సింగమనేని ప్రకృతి శాపం వలన కేంద్రం, రాష్ట్ర ప్రభుత్వాల ఆర్థిక విధానాల నిర్లక్ష్యం వల్ల వర్షాలు పడక, సాగునీరు లేక పండిన అరకొర ఏకైక పంట వేరుశనగకు గిట్టుబాటు ధర లేక, కరెంటు బిల్లులు చెల్లించలేక, పిల్లల పెళ్లిళ్ల కోసం, సంసారం కోసం, పంటు పెట్టుబడుల కోసం చేసిన అప్పులు ఎలా తీర్చాలో దిక్కుతోచక రుణ దాతల ఒత్తిడి అధికం కావడంతో రైతులు ఆత్మహత్యలకు పాల్పడుతున్నారని తెలిపే కథ 'అలజడి'. ఈ కథలో రైతు తన కూతురిలో అప్పులేవి రైతు ఎవరున్నారమ్మా ఈ ఊళ్లో! ఎంత చెట్టుకు అంతగాలి! అన్నాడు. 'నాలుగేళ్ల యింది, శనక్కాయ పంటకు నీళ్లు లేక బావులు

ఎండిపోయి, బోర్లు ఫెయిలయిపోయి ఆ తోట సేద్యం అట్లు అయిపోయింది. ఇంట్లో పది మంది తినేవాళ్లున్నారు. ఇంక అప్పులు పెరిగిపోక ఏముంది. అయినా ఇలాంటి చావు' అంటూ కన్నీళ్లు తుడుచుకున్నాడు. గతంలో ఇక్కడి రైతాంగం సంప్రదాయ మిశ్రమ ఆహారపంటలైన సజ్జ, జొన్న, కర్ర, కంది అలసంద, పెసర, సాములు, లాంటి పంటలు పండించేవారు. అయినా కాలక్రమంలో జరిగిన మార్పుల వల్ల ఇప్పుడు జిల్లా మొత్తం వేరుశనగను పండిస్తున్నారు. అయితే ఇప్పుడు వేరుశనగ పంట సంక్షోభంలో కూరుకుపోయింది. ఈ సంక్షోభం కారణంగా రైతాంగం విపరీతమైన రుణ భారంతో, రుణాలను తీర్చలేని నిస్సహాయ స్థితిలో జిల్లా రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు.

'ఊబి' కథలో సింగమనేని నారాయణ గారు నారప్ప లాంటి రైతులు వ్యవసాయ జూదంలో మాటి మాటికి ఓడిపోతున్న తీరును చిత్రించిన విధం అందరినీ కలచి వేస్తుంది. 'ఏం నారప్పా మరో పది అడు గులు దించమం టావా' అనడిగాడు బోరిం గ్ మనిషి. దించప్పాదించు... అయిందేదో అయ్యిందని కీచుగొంతుతో అరిచాడు నారప్ప. మరో పది అడుగులు దించే సరికి మిషన్ కీచుమని గట్టిగా అరుస్తూ ఆగిపోయింది. ఏమయ్యిందని అంటూ అడిగిన వాళ్లకు 'బండ పడిందప్పా! ఇంక కష్టమే' అని అన్నాడు బోరింగ్ మనిషి నిస్సహాయంగా.

నీళ్లలేక వ్యవసాయం చేయలేని పరిస్థితుల్లో రైతులు అధిక వడ్డీలకు అప్పు తెచ్చి కొత్త బోర్లు వేస్తూ పాతబోర్లు లోతు చేసినా చాలా బోర్లు ఫెయిల్ అయ్యి రైతులకు నిరాశను మిగిల్చుఉతున్నాయి.

'అగాధం' కథలో రచయిత పంటలు పండక అప్పుల ఊబిలో కూరుకుపోయిన రైతన్నలను చిత్రీకరించారు. రాత్రి పదకొండు దాటినా నిద్రపట్టలేదు రాయప్పకు. ఆర్నెల్ల కిందట బావిలో నీళ్ల కోసం అప్పుచేసి వేయించిన సబ్‌మెర్సిబుల్ బోరు ఎండిపోయింది. దీనితో పాటు రకరకాల అప్పులు లక్షన్నర దాటినాయి. ఇలా చింతలు చేసి చేసి అర్ధరాత్రి బయటకు వచ్చి పక్కనే ఉన్న పశువుల కొట్టంలోకి వెళ్లి, పశువుల గాటి మీద నిలబడి అట్టవ మీద చూస్తే పురుగుల మందులు పెట్టె గూట్లోనే తళతళ తెల్లగా మెరుస్తూ కనిపించింది మోనోక్రొటోఫాస్. ముందుకు వంగి ఒకదాన్ని తీసుకుని గట్టిగా చేతుల్లో పట్టుకొని కిందికి దిగినాడు రాయప్ప. ఈ ప్రాంత రైతులను ప్రకృతి పాలకులే కాక భూగర్భ జలాలు కూడా మోసం చేస్తున్నాయి. మరోవైపు కురిసే అడపాదడపా వర్షానికే వేరుశనగకు మొవ్వకుళ్లు తెగుళ్లు సోకి విపరీతంగా పంట దిగుబడి దెబ్బతింటుంది. వేరుశనగకు సోకిన మొవ్వకుళ్లు వ్యాధి నుంచి కాపాడేందుకు ప్రభుత్వం అందించిన మోనోక్రొటోఫాస్‌ను రైతులు సేవించి ఆత్మహత్యలు చేసుకుంటున్నారు, ఈ రైతన్నల ఆత్మహత్యల ను నివారించేందుకు ప్రభుత్వం తగిన చర్యలను తీసుకోవాలని రచయిత ఈ కథ ద్వారా తన ఆక్రోశాన్ని వెల్లడించాడు.

జిల్లా రైతాంగాన్ని కాపాడు కోవాలని వాళ్లు ఆత్మహత్యలు చేసుకోకుండా, వాళ్లలో జీవితం పట్ల విశ్వాసాన్ని, కరువు పట్ల ధైర్యాన్ని జాగృతం చేయాలనే సంకల్పంతో చేపట్టిన 'రైతు- ఆత్మవిశ్వాస యాత్ర'లో సింగమనేని నారాయణ కీలక భూమికను పోషించారు.

విత్తనం పంటగా మారేంత వరకూ ఎన్నిమార్పులు చెందుతుందో రైతు అన్నివిధాలుగా శ్రమను ధారపోస్తాడు. పురుగు మందులు, నాసిరకం విత్తనాలకి తోడు ప్రకృతి నిరాదరణ చూపడం, పండించిన పంటకు మార్కెట్టు లేకపోవడం




ఇవన్నీ రైతును నిస్సహాయున్ని చేస్తాయనడంలో ఎంతమాత్రం సందేహం లేదు. వీటన్నింటినీ ఎదిరించి పోరాడి విజయం కోసం ఆరాటపడటంతోనే రైతుకు ప్రత్యేకత ఉంటుంది. వ్యవసాయమంటేనే పోరాటం. ఇన్ని పోరాటాల్లో రాటుదేలిన రైతు తనకు ప్రతికూలంగా మారిన ఆర్థిక, రాజకీయ, సాంఘిక, పరిస్థితుల్ని మార్చుకోవడానికి పోరాటం చేయాలేకానీ, పిరికివాడై ఆత్మహత్యలకు పాల్పడటం రైతు లక్షణం కాదు.

**ముగింపు :** సింగమనేని నారాయణ వ్యవసాయానికి సంబంధించి 14 కథలు రాశారు. అందులో రైతుల ఆత్మహత్యలకు సంబంధించిన కథలు మూడున్నాయి. అవే అగాథం, అలజడి, ఊబి, ఈ మూడు కథల్లో రచయిత రైతుల ఆత్మహత్యల గురించి వాటి కారణాలను అద్దంలో ప్రతిబింబంలా వివరించారు.

# సమతుల ఆహారం...

# సాధారణ జీవన చక్రం




రత్నాకరం నందిని,
పోషకాహార నిపుణులు

**మా**నవ శరీరానికి నిరంతరంగా పోషకాల అవసరం ఉంటుంది. ఈ పోషక పదార్థాలు ఆరోగ్యాన్ని, శరీరంలో జరిగే క్రియలు నిర్వహించడానికి ఉపయోగపడతాయి. ఇవి ప్రతిరోజూ సరైన మోతాదుల్లో శరీరానికి కావాలి. ఇదంతా కూడా సమతుల ఆహారంతోనే సాధ్యమవుతుంది.

**జీవిత చక్రంలో ఆహారం - దాని పాత్ర**

వివిధ దశల్లో, వివిధ అవసరాల్లో ఆహారం దాని పాత్రను కొన్ని గ్రూపులుగా విభజించవచ్చు.

1. గర్భం దాల్చినప్పుడు - ఈ దశలో జీవితం మొదలవుతుంది.
2. సంవత్సరంలోపు పిల్లలు - ఈ దశలో వేగవంతమైన మొదటి సంవత్సరం పెరుగుదల మొదలవుతుంది.
3. బాల్యం - ఈ దశలో నుంచి 2 సంవత్సరాల వరకు ఆహారంలో చాలా మార్పులు జరుగుతాయి.

**గర్భవతులు తీసుకోవాల్సిన ఆహారం**

ఈ దశలో వేగవంతమైన పెరుగు దల జరుగుతుంది. పిండం పెరుగుదల ఆహారం తీసు కోవడంపైన ఎక్కువగా ధారపడుతుంది.

**గర్భం దాల్చినప్పుడు పెరిగిన పోషకాల అవసరాలుఉపయోగం ఎలా ఉంటుందంటే...**

- పిండం వేగంగా పెరుగుటకు
- ప్లెసెంటా (మాయ) అభివృద్ధి చెందేందుకు
- తల్లి కణజాలం పెరుగుటకు
- రక్తం వృద్ధి చెందేందుకు
- ఉమ్మనీరు తయారు కావటానికి
- గర్భంలో ఉన్న శిశువు మెదడు ఎదుగుదలకు
- ఎముకలు, అస్థిపంజరం తయారుకావటానికి

**గర్భవతులు - వ్యాయామం**

వ్యాయామం ప్రతి మూడు రోజులకు వారంలో అవ సరం. ఇది గర్భవతిగా ఉన్న స్త్రీకి డెలివరి సులభంగా అవడానికి ఉపయోగపడుతుంది. నడక, ఒకేచోట సైకిల్ తొక్కటం, ఈదటం లాంటి వ్యాయామాలు చెయ్య టం వల్ల బిడ్డ బయటికి క్షేమంగా రావటానికి ఉపయోగపడతాయి. వీటితో పాటు మామూలుగా చేసే పనులు చేయాలి.

**మాంసకృత్తులు (ప్రొటీన్లు)**

ఇది మామూలుగా అవసరమైన దానికంటే 30% ఎక్కువగా ఇవ్వాలి. మామూలుగా స్త్రీకి 45 గ్రాములు అవసరమైతే గర్భవతిగా ఉన్నప్పుడు 14 గ్రామాలు రెండో, మూడవ ట్రైమెస్టర్స్‌లో అవసరం. మంచి నాణ్యత గల ప్రొటీన్లు ఇవ్వాలి. పాలు, మాంసం, చేపలు, గుడ్డు, చీజ్ లాంటివి తినాలి. శాఖాహారులకు పొట్టుతో కూడిన ధాన్యాలు, గింజలు, చిక్కుళ్లు, మొలకెత్తిన విత్తనాలు తీసుకోవాలి.

**కెలోరీలు**

ఇవి శక్తిని ఇవ్వటానికి ఉపయోగపడతాయి. 300 కెలోరీలు రెండో భాగంలో అవసరం (అదనంగా)..

**ఖనిజాల అవసరాలు :**

కాల్షియం, ఐరన్ అవసరం చాలా ఎక్కువగా ఉంటుంది. ఎముకల ఎదుగుదలకు కాల్షియం చాలా అవసరం. పిండం చిగుళ్ల గట్టిపడానికి, రక్తం గడ్డకట్టే ప్రక్రియలో కూడా అవసరం. పాలు, పాలకు సంబంధించిన పదార్థాలు కాల్షియంకు మొదటి మూలం వీటితో పాటు చిక్కుళ్లు, ఆకుకూరలు (పాలకూర) కూడా క్యాల్షియంను అందిస్తాయి. వీటితో పాటు కాల్షియం టాబ్లెట్స్ కూడా తీసుకోవాల్సి వస్తుంది.

**(మిగతా 25వ పేజీలో)**

# కరువు సహాయక చర్యలు ఏవీ?

ఎస్ఎం బాషా,
మానవహక్కుల వేదిక
94406 83555

ప్రభుత్వం ఏమాత్రం తడబాటు లేకుండా గత ఏడాది అక్టోబర్ మాసంలో అనంతపురం జిల్లాలోని మొత్తం 63 మండలాలను కరువు మండలాలుగా ప్రకటించింది. అయితే జిల్లా అంతటా సర్వవ్యాపితమైన కరువును గురించి విచారించాలో, ప్రభుత్వం కరువు మండలాలుగా ప్రకటించిందని ఊరట చెందాలో అర్థంకాని ఒక అనిశ్చిత పరిస్థితి నెలకొంది. ఎందుకంటే కరువు మండలాలుగా ప్రకటించి 5-6 మాసాలు గడిచినా సహాయక చర్యల ఊసే కానరావడం లేదు. రైతులు ఆత్మహత్యలు చేసుకుంటూనే ఉన్నారు. నిలువునా ఎండిపోతున్న పళ్ల తోటలను చూసి కుదేలవుతున్న రైతులను కదిలిస్తే విషాదం. మరోపక్క వలసలు కొనసాగుతూనే ఉన్నాయి. మనుషులకు, పశువులకు, జీవాలకు తాగునీరు దొరక్క, వైద్య సదుపాయాలు లేక ప్రజలు దిక్కుతోచని పరిస్థితుల్లో ఉన్నారు. అసలు కరువు పరిస్థితులు ఏర్పడినప్పుడు ప్రజల మానాన ప్రజలను వదిలి వేయడమేనా నాగరిక ప్రభుత్వాల పని? ప్రభుత్వ బాధ్యతల గురించి ప్రజల హక్కుల గురించి ప్రశ్నించడం నేర్చుకోలేమా? ఇవన్నీ మనం మనసుపెట్టి ఆలోచించాలి.

## కరువు కాలాల్లో ఫ్యామిన్ కోడ్‌లు

కరువులు, వరదలు ప్రకృతి శాపాలు. ఇందుకు ముందుగా బలయ్యేది వ్యవసాయం, రైతులు. వర్షాలు రాకపోయినా పంటలు పండకపోయినా కరువులు ఏర్పడుతాయి. వర్షాలు అధికమై పంటలు వరదల పాలయినా కరువులు ఏర్పడుతాయి. రైతులను కాదన్న ఏ ప్రభుత్వం చరిత్రలో మనలేదు. 14వ శతాబ్దంలో దేశంలోనే కరువుల్లో రైతులను ఆదుకోవడానికి మొదటి ఫ్యామిన్ కోడ్ రూపొందించిన వాడు ఢిల్లీని పాలించిన మహమ్మద్ బిన్ తుగ్లక్. ఆ తరువాత 1833లో బ్రిటీష్ ప్రభుత్వం ఒక ఫ్యామిన్ కోడ్‌ను రూపొందించింది. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత 1950లో భారత ప్రభుత్వం ఒక ఫ్యామిన్ కోడ్‌ను రూపొందించింది. సగటు వర్షపాతం కంటే 25 శాతం వర్షపాతం తక్కువ కురిసినప్పుడు కరువు ప్రాంతంగా ప్రకటించవచ్చని చెప్పింది. దాంతో పాటు ఈ కింది విషయాలను కూడా పరిగణనలోకి తీసుకోవాలని సూచించింది.

- ప్రజలకు అప్పులు పుట్టకపోవడం
- ప్రజల్లో అసహనం అధిక కావడం, నేరపూరిత సంఘటనలు పెచ్చరిల్లడం
- మేతకోసం పశువులు, జీవాలు అసాధారణంగా వెంపర్లాడడం
- సాధారణ ఆహార పదార్థాల ధరలు ఆకాశాన్నంటడం
- రైళ్లల్లో ప్రయాణాలు, తీర్థయాత్రలు బాగా తగ్గిపోవడం
- సాధారణం కంటే భిన్నంగా ప్రజలు చేయడానికి పనులు లేక ఖాళీగా ఉండటం
- రైతులు అసాధారణంగా తమ వద్దనున్న బంగారు, వెండి నగలను కుదువ పెట్టడం లేదా అయినకాడికి అమ్మడం.

2.50 మి.మీ అంతకంటే ఎక్కువ వర్షపాతం ఒక దినంలో కురిస్తే దానిని ఒక వర్షపు దినంగా పరిగణిస్తారు. సగటున 750 మి.మీ తక్కువ కురిసే ప్రాంతాల్లో 15 శాతం 750 మి.మీ నుంచి 1000 మి.మీ కురిసే ప్రాంతాల్లో 20

శాతం, 1000 మి.మీ ఆపైన కురిసే ప్రాంతాల్లో 25 శాతం తక్కువ వర్షపాతం నమోదయితే కరువు మండలాలుగా ప్రకటించాలని 1995లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రచురించిన డ్రాట్ మాన్యువల్ చెబుతోంది. కేంద్ర ప్రభుత్వం ప్రతి 4-5 సంవత్సరాల కొకసారి కరువు సహాయక కార్యక్రమాలు రూపొందిస్తూ డ్రౌట్ మాన్యువల్స్‌ను విడుదల చేస్తోంది. 2016లో కేంద్ర ప్రభుత్వం విడుదల డ్రవుట్ మాన్యువల్ ఏం చెబుతుందో ఒకసారి పరిశీలిద్దాం.

**రాష్ట్రప్రభుత్వం అన్ని శాఖాధిపతులతో ఒక రాష్ట్ర స్థాయి కమిటీని నియమించాలి :**

రాష్ట్ర ప్రభుత్వం రాష్ట్రంలో సంభవించే కరువు పరిస్థితులను అంచనా వేయడం కోసం డ్రౌట్ మానిటరింగ్ సెంటర్లను ఏర్పాటు చేయాలని మాన్యువల్ సూచిస్తోంది. ఇందులో వాతావరణ శాఖ, మెట్టసాగు, జలవనరుల శాఖల నిపుణులతో పాటు ఇస్రో, రిమోట్ సెన్సింగ్ బృందాల వారు సభ్యులుగా ఉంటారు. కరువు ప్రకటిత ప్రాంతాల్లో సహాయక చర్యలు అమలు చేయడానికి అవసరమైన నిధుల కోసం రాష్ట్ర ప్రభుత్వాలు కేంద్ర ప్రభుత్వానికి ప్రతిపాదనలు పంపాలి. ఎప్పుడైతే కరువు మండలాలుగా ప్రకటిస్తారో అప్పటి నుంచి ఒక వారం లోపలనే నివేదికను సమర్పించాలని డ్రౌట్ మాన్యువల్ సమయ నిర్దేశాన్ని చేసింది.

**జిల్లా స్థాయిలో సహాయక కార్యక్రమాల అమలు**

కరువు సహాయక కార్యక్రమాలు అమలు కోసం కరువు మండలాలుగా ప్రకటించిన వెంటనే జిల్లాస్థాయిలో అన్ని శాఖాధిపతులను సమన్వయం చేస్తూ జిల్లా కలెక్టరు కమిటీని ఏర్పాటు చేయాలి. ఇందులో అధికారులే కాకుండా స్వచ్ఛంద సంస్థల ప్రతినిధులు, పౌర సమాజం నుంచి ప్రతినిధులు ఉండాలి. సహాయక చర్యల కార్యక్రమాలను ఈ కమిటీ పర్యవేక్షిస్తుంది. అవసరమైన సూచనలు, సలహాలు ఇస్తుంది.

**1) ప్రజలకు పనిదినాలు కల్పించడం**

కరువు కాలంలో వ్యవసాయ పనులు లేక, కుటుంబ పోషణార్థం ఇతర ప్రాంతాలకు ప్రజల వలసల్ని నిరోధించ డానికి ప్రభుత్వం వెంటనే పనులు కల్పించాల్సి ఉంటుంది. పార్లమెంటులో చట్టం చేయడం ద్వారా 2005లో ఏర్పడిన మహాత్మాగాంధీ ఉపాధి హామీ పథకాన్ని (ఎంజీఎన్ఆర్ఈజీఎస్) సమర్థవంతంగా అమలు జరపాలి. అయితే జిల్లాలో గత ఎనిమిది సంవత్సరాలుగా అసాధారణ కరువు పరిస్థితులు నెలకొని ఉన్న కారణంగా దాదాపు నాలుగు లక్షల మంది ఉపాధి కోసం ఇతర ప్రాంతాలకు వలస పోయినారు. వలస వెళ్లిన వారిని సంప్రదించి వారికి పనులు కల్పించి వెనక్కు రప్పిస్తామని అధికారులు అప్పుడప్పుడూ ప్రకటనలు ఇస్తూ ఉండటం ఒక ఆనవాయితీగా మారింది. ఇంతవరకూ ఎవరూ వచ్చిందీ లేదు. వలసలు ఆగనూలేదు.

ఇదిలా ఉండగా ఉపాధి పనులు కల్పిస్తూ ఆదుకోవాల్సిన ప్రభుత్వం గత సంవత్సరం చేసిన పనులకే వేతనాలు చెల్లించలేదంటే ప్రభుత్వం, అధికారుల నిర్లక్ష్యం ఏపాటిదో అర్థమవుతుంది. పనులు చేసిన 14 రోజుల లోపలే వేతనాలు చెల్లించాలని, ఆలస్యమైతే వడ్డీతో సహా చెల్లించాలని ఉన్నా ప్రభుత్వానికి చీమకుట్టినట్లుగా కూడా లేదు. ఇంతటి ఘనకార్యాలు సాధించినందులకే ప్రభుత్వం బదిలీపై వెళ్లిన జిల్లా కలెక్టర్‌ను, ప్రస్తుతప్రాజెక్టు డైరెక్టర్‌కు అవార్డులు ప్రకటించి సత్కరించింది. ఈ భాగోతమేమిటో ఒక్కసారి పరిశీలిద్దాం..

| | |
|---|---|
| **జిల్లాలో మంజూరు చేసిన జాబ్ కార్డులు** | **6,54,133 మందికి** |
| **ఆధార్‌తో అనుసంధానం అయినవి** | **4,59,281 మంది** |
| **ఆధార్‌తో అనుసంధానం కానివి** | **1,94,852 మందికి** |
| **ప్రస్తుతం పని కల్పించినది** | **2,76,259 మందికి** |



**సరాసరి పని కల్పించిన దినాలు 62 రోజులు**

**2016-17 సంవత్సరానికి (గత సంవత్సరం)**

**ప్రభుత్వం ఇంకా చెల్లించాల్సినంది రూ.61,31,91,516**

**2017-18 సంవత్సరానికి చెల్లించాల్సినది**

**రూ.9,13,59,643**

**మొత్తం కూలీలకు చెల్లించాల్సినది రూ.70,45,90,858**

**100 రోజులు పని చేసినది :**

**2014-15లో 15.22%**

**2015-16లో 31.92%**

**2016-17లో 26.06%**

సగటున గిట్టుబాటు దినసరి వేతనం రోజుకు 60 నుంచి 120 రూపాయల వరకు...

దాదాపుగా 70 కోట్ల రూపాయలకు పైబడి ఇదివరకే బకాయిలు పడిన ప్రభుత్వం, ఇప్పుడు కరువు సహాయక కార్యక్రమాల్లో కొత్తగా ఏవిధంగా పనులు కల్పించగలదో ప్రభుత్వానికే తెలియాలి. బకాయిలు చెల్లించాలని అధికారుల చుట్టూ తిరగడం, అధికారులు విసుక్కోవడం, చివరకు బ్యాంకుల వద్దకు వెళితే వారు కూడా కసురుకోవడం ప్రజల నిత్య అనుభవం. ఎవరిని అడగాలో చేసిన కూలీ డబ్బులు ఎప్పుడొస్తాయో తెలియని పరిస్థితి. కూలి డబ్బుల కోసం అధికారుల చుట్టూ తిరిగి విసిగి వేసారిన గోవిందప్ప (35) అనే కూలీ అడదాకులపల్లి, పెనుకొండ మండలానికి చెందినవారు. 03.04.2017న తహసీల్దారు కార్యాలయం ఆవరణలో ఒంటినిండా డీజిల్ పోసుకుని ఆత్మహత్యకు పాల్పడ్డాడు. మానవీయ స్పర్శ జ్ఞానం కోల్పోయిన అధికారులకు చీమ కుట్టినట్లుగా కూడా లేదు. అమాత్యుల, రాజకీయ నాయకుల సేవా కార్యక్రమాల్లో మునిగిపోతే అధికారులకు సామాన్యుల బాధలు అర్థమవుతాయా? బ్యాంకుల్లో ఆధార్ నమోదు కాలేదన్న కారణాన చాలామంది వేతనాలు నిలుపుదల చేశారు. ఎందుకు నమోదు కాలేదో చూడాల్సిన బాధ్యత అధికారులది. బాధ్యతలు లేవు. మానవత్వం అంతకన్నా లేదు. సుప్రీం కోర్టు ఆధార్ ప్రామాణికం కాదని హెచ్చరిస్తున్నా అధికారుల తీరుమారదు.

ఉపాధి వేతనాలు బకాయిల చెల్లింపుల కోసం ప్రభుత్వ కార్యాలయాల వద్ద నిరసనలు, ధర్నాలు జరుగుతూనే ఉన్నాయి. ధర్నాలకు, శాంతియుత నిరసనలకు కాలం చెల్లిపోయిందన్నట్లుగా అధికారుల తీరు స్పష్టం చేస్తున్నది. ఒకరిద్దరు వస్తే మాట్లాడించరు. 10 మంది ఆపైనవస్తే, పోలీసులు తరుముతారు. ఎవరిని అడగాలో ఎవరికి చెప్పుకోవాలో తెలియని పరిస్థితి నెలకొంది. అధికార పార్టీ నాయకుల వద్ద మాత్రమే అధికారుల కళ్లు, చెవులు పనిచేస్తాయని ఒకానొక జరిగిన సంఘటన చెబుతోంది. ఈ మధ్య తన ఇలాకాలో తాగునీటి పథకానికి ప్రతిపాదనలు సిద్ధం చేయాల్సిందిగా ఒక అధికార పార్టీ శాసనసభ్యుడు కోరాడు. ఫలితం లేనట్లుంది. ఆగ్రహించిన ఆ శాసనసభ్యుడు జిల్లా కేంద్రంలో ధర్నా చేస్తానని ప్రకటించాడు. అంతే సదరు అధికారులు శాసనసభ్యుడి ఇంటికే వెళ్లి ప్రతిపాదనలు సిద్ధం చేసి ఇచ్చినట్లుగా వార్తా పత్రికల్లో వచ్చింది. శాసనసభ్యుల ధర్నాలకైతే విలువ ఉంది కానీ సామాన్యుల ధర్నాలకు, నిరసనలకు విలువ ఎక్కడుంది? అందుకే ఇకనుంచి ఉపాధి కూలీలు ఏ ప్రాంతానికి చెందిన వారు ఆ ప్రాంతం ప్రజా ప్రతినిధి వద్ద తమ నిరసనలు తెలియజేస్తే, ఎవరో ఒక ప్రజా ప్రతినిధికి దయగలిగి ధర్నా చేస్తే, ఉపాధి కూలీ బకాయిలు చెల్లింపులు జరుగుతాయేమోనన్న ఆశ.

**2) గ్రామాల్లో మంచినీటి సౌకర్యాలు కల్పించడం**

డ్రౌట్ మాన్యువల్ ప్రకారం, మనుషులకు పశువులకు అవసరమైన మంచినీటి సరఫరా కోసం చర్యలు యుద్ధ ప్రాతిపదికన చేపట్టాలి. కరువు మండలాలుగా ప్రకటించిన వెంటనే ముందుగా ఈ వరకే అందుబాటులో ఉన్న నీటి వనరుల సామర్థ్యాన్ని లెక్కగట్టాలి. ఆ తర్వాత మొత్తం ప్రజల దైనందిన జీవితంలో అవసరమయ్యే నీటిని గూర్చి అంచనాలు రూపొందించాలి. జిల్లాలో లభ్యమయ్యే అన్ని ప్రైవేటు, ప్రభుత్వ నీటి వనరులను జిల్లా యంత్రాంగం తన స్వాధీనంలోనికి తీసుకోవాలి. సాధ్యమైనంత వరకూ గ్రామాలకు పైపులద్వారానే నీటి సరఫరాకు ప్రాధాన్యం ఇవ్వాలి. సాధ్యంకాని పరిస్థితుల్లో మాత్రమే తీవ్రతను బట్టి రోడ్డు రవాణా, రైలు మార్గాల గుండా నీటి సరఫరాను చేపట్టాలి.

వాస్తవానికి జిల్లాలో ప్రస్తుతం నెలకొని ఉన్న తాగునీటి ఎద్దడి ఊహించరానిదేం కాదు. ప్రతి సంవత్సరం ఈ పరిస్థితులు దాపురిస్తూనే ఉన్నాయి. ఇటువంటి పరిస్థితుల్లో ఏమాత్రం ఆలోచన కలిగిన ప్రభుత్వాలైనా శాశ్వత పరిష్కారాల వైపు ఆలోచిస్తాం. ముఖ్యమంత్రి 2015లోనే అనంతపురం జిల్లాలోని ప్రతి గ్రామానికి వాటర్ గ్రిడ్ ద్వారా మంచినీటి సౌకర్యం కల్పిస్తామన్నారు. కానీ ఎందుకనో చాలా సౌకర్యంగా ఈ వాగ్దానాన్ని మరిచిపోయారు. ట్యాంకర్ల ద్వారా నీరు సరఫరా చేస్తే ప్రజల ఆరోగ్యాలు గాలికిపోయినా రాజకీయనాయకుల, అధికారులకు కూడికలు, తీసివేతలు నేర్పుతున్నాయి. అందుకే తాత్కాలిక లాభాల కోసం తప్ప శాశ్వత పరిష్కారాల వైపు ఎవరూ ఆలోచించడం లేదు.

ఈ జిల్లాలో చెరువుగానీ, కుంటగానీ లేని గ్రామమే లేదు. ఇవన్నీ గొలుసుకట్టు పద్ధతిలో అనుసంధానమై ఉన్నాయి. అధికారుల అండదండలతో రాజకీయ నాయకుల, బడాబాబుల ఆక్రమణలో ఉన్న చెరువుల్ని, కుంటల్ని, సప్లయి చానళ్లకు విముక్తి కలిగించాలి. ఉపరితల నీటితో వీటిని నింపితే తాగునీటి రిజర్వాయర్లుగా ఉపయోగపడతాయి. ప్రభుత్వానికి పెద్దగా ఖర్చు కూడా ఉండదు.

**3. ఆహారభద్రత**

కరువు ప్రకటిత ప్రాంతాల్లో ఆహార భద్రతను గురించి డ్రౌట్ మాన్యువల్ నొక్కి చెబుతోంది. జాతీయ ఆహార భద్రతా చట్టం 2013 ప్రకారం 75 శాతం గ్రామీణ ప్రాంత ప్రజ

లకు 50 శాతం పట్టణ ప్రాంత ప్రజలకు ఆహార భద్రతను స మకూర్చాల్సిన బాధ్యత ప్రభుత్వాలది. గ్రామాల్లో ఆహారభ ద్రతా చట్టం పరిధిలోకివచ్చే అన్ని కుటుంబాలను జిల్లా యం త్రాంగం గుర్తించాలి. ప్రజా పంపిణీ పథకం ద్వారా ఆహార ప దార్థాలు ప్రజల అందుబాటులోకి తేవాలి. ఏ ఒక్క కుటుంబం కూడా మినహాయింపు జరగకుండా ప్రభుత్వం ప్రత్యేక కార్యక్రమం చేపట్టాలి. ఒకవేళ ఎవరికైనా రేషన్‌కార్డు లేకపోతే వెంటనే ఇవ్వడానికి ఏర్పాటు చేయాలి. అంతవరకూ ఇతరత్రా ఆధారాలను పరిగణనలోనికి తీసుకొని ఆహార పదార్థాలు పంపిణీ చేయాలి. రేషన్‌కార్డుల్లో ఎవరైనా కుటుంబ సభ్యుల పేర్లు నమోదు కాకపోతే అధికార యంత్రాంగం గుర్తించి వెంటనే రేషన్‌కార్డులు సవరించి ఇవ్వాలి. జిల్లా కలెక్టర్ సరుకులు అన్యాక్రాంతం కాకుండానూ, పక్కదారులు పట్టకుండానూ జాగ్రత్తలు పాటించాలి.

కరువు మండలాలుగా ప్రకటించి ఆరు నెలల కాలం కావస్తున్నా, ఆహార భద్రతా చట్టాన్ని గురించి ప్రభుత్వం గానీ, జిల్లా యంత్రాంగం గానీ పట్టించుకోనేలేదు. కనీసం గ్రామాల్లో సర్వేలు కూడా నిర్వహించినట్లు వార్తలు తెలియటం లేదు. పా ర్లమెంటు ద్వారా చేసిన చట్టాల పట్లే ప్రభుత్వాలు అధికారులు ఏవిధంగా బాధ్యత వహిస్తున్నారో ఇది చూస్తే అర్థమవుతుంది.

**<u>4) పౌష్టికాహారం పంపిణీ :</u>**

డ్రౌట్ మాన్యువల్ సూచిస్తున్న మరొక ప్రాధాన్యతాం శం 0 నుంచి 6 సంవత్సరాల పిల్లలకు పౌష్టికాహారం సరఫరా. ఇందుకోసమే 1975లో ఐసీడీఎస్ పథకాన్ని దేశంలో ప్రవేశ పెట్టారు. అంతేకాకుండా పాఠశాల పిల్లలకు మధ్యాహ్న భోజన పథకం బాధ్యతలు కూడా ప్రభుత్వాలవే. కరువు పరిస్థితుల నే పథ్యంలో పిల్లలతో పాటు వృద్ధులు, అంగవైకల్యం కలిగిన వారు, మహిళలు, నిస్సహాయ స్థితిలో ఉన్న వారికి ఆహారం అందించడానికి సామాజిక వంట కేంద్రాలను ప్రారంభించాలని డ్రౌట్ మాన్యువల్ నిర్దేశిస్తూ ఉంది. పూర్తిగా ప్రభుత్వం ద్వారా గానీ, స్వచ్ఛంద సంస్థల సహాయ సహకారాల వల్ల గానీ, సా మాజిక వంట కేంద్రాలు నెలకొల్పాలి. కరువు పరిస్థితులు పూ ర్తిగా నిష్క్రమించే వరకూ ఈ వంట కేంద్రాలను కొనసాగిం చాలి.

ప్రభుత్వ పాఠశాల పిల్లలకు మధ్యాహ్న భోజన పథకం సెలవుల్లో కూడా కొనసాగింపులో భాగంగా 'కరువు బువ్వ' పేరుతోబియ్యం వగైరా ఇస్తామంటోంది. ఆచరణలో దానిని అసాధ్యంగా మార్చే ప్రయత్నాలు జరుగుతున్నాయి. కరువు బువ్వ కోరుకునే పిల్లలందరూ ఆధార్‌కార్డు నెంబరును తెలియజేస్తూ దరఖాస్తు చేసుకోమన్నారు. వేసవి సెలవుల్లో తలోదారి వెళ్లిపోయిన ఉపాధ్యాయులు, పిల్లలు కలిసేదెన్నడు? పిల్లల పేర్లు పంపేదెన్నడు? ఇప్పుడేదో సడలింపులు ఇచ్చినట్లున్నారు. ఈ రకంగా అధికారుల మధ్య చర్చా, మీమాంసలు ముగిసేటప్పటికి తిరిగి పాఠశాలలు మొదలవుతాయి. చివరికి కరువు బువ్వల నివేదికలు మాత్రం పిల్లలతో సంబంధం లేకుండానే వారి పేర్లతో నివేదికలు సిద్ధమవుతాయి. పోయినేడాది ఇదే తంతు నడిచింది.

ఇంతేకాకుండా గ్రామాలు, తండాల నుంచి చాలా మంది వలస వెళ్లడం వల్ల వృద్ధులు పిల్లలు ఆలనాపాలనా లేకుండా ఉన్నారు. వారి భోజన సదుపాయాల నిమిత్తం సామాజిక వంటశాలలు లేదా గంజికేంద్రాలయినా ప్రభుత్వం ఏర్పాటు చేయాలి. ప్రభుత్వ నిధులు సకాలంలో రాకున్నా శ్రీమంతుడు సినిమాలో లాగా సమాజానికి తిరిగి ఇవ్వడాన్ని అధికారులు, రాజకీయ నాయకులు అలవాటు చేసుకోవాలి. లేకుంటే అనవసరంగా లావెక్కిపోతారు.

**<u>5) నిస్సహాయులకు ఆర్థికసహాయం</u>**

కరువు మాన్యువల్ ప్రకారం కరువు మండలాలుగా ప్రకటించిన వెంటనే జిల్లా కలెక్టరు గ్రామాలను గురించి సర్వే చేయించాలి. ప్రతి గ్రామంలోనూ ఏ ఆదరువు లేని నిస్సహాయ కుటుంబాలను గురించి వివరాలు సేకరించాలి. గ్రామంలో వృద్ధులు, అంగవైకల్యం కలిగిన వారు, నిస్సహా యులను గుర్తించి రాష్ట్ర ప్రభుత్వపు మార్గదర్శకాలననుస రించి వారికి నగదు రూపంలో గానీ, ఆహార పదార్థాల రూపం లో గానీ సహాయం అందజేయాలి. మారుమూల గ్రామాల్లో సైతం తిండిగింజల నిధులు ఏర్పాటు చేయాలి. (గ్రెయిన్ బ్యాంక్స్) ఇందుకోసం వినియోగించే నిధులు ప్రకృతి వైపరీత్యాల నిధుల నుంచి తీసుకోవాలి.

**<u>6. కరువుల కాలంలో రుణమాఫీలు - రాయితీలు :</u>**

కరువు ప్రాంతాలుగా ప్రకటించిన వెంటనే రాష్ట్ర ప్రభుత్వాలు తమ రాష్ట్ర ఆర్థిక పరిస్థితులను, కరువు తీవ్రతలను పరిగణనలోనికి తీసుకొని సహాయ కార్యక్రమాలు రూపొందించాలి.

- కరువు ప్రాంతాల్లో భూమిశిస్తులు మాఫీ చేయాలి
- రైతుల చెల్లించాల్సిన తక్కావి, నీటి తీరువాలు, కరెంటు చార్జీలు, వ్యవసాయ రంగానికి చెందిన ఇతరత్రా చెల్లిం పులను వాయిదా వేయాలి. రైతుల నుంచి బలవంతపు వసూళ్లకు పాల్పడరాదని ప్రభుత్వం స్పష్టమైన ఉత్తర్వు లివ్వాలి.
- రైతులు, బ్యాంకులకు, ఇతర సంస్థలకు చెల్లించాల్సిన స్వల్పకాల వ్యవధిరుణాలు, దీర్ఘకాలిక వ్యవధి రుణాల ను వాయిదా వేయాలి.రుణాలను రీ-షెడ్యూలు చేయాలి.
- కరువు ప్రాంతాల్లోని విద్యార్థులకు విద్య/పరీక్ష ఫీజులను రద్దు చేయాలి.
- ప్రభుత్వం 2017-18 సంవత్సరానికి పంటరుణాలు రీ-షెడ్యూలు మొదలు పెట్టినట్లు ఈ వారమే ప్రకటించింది. అయితే బ్యాంకులు విముఖత చూపుతుండటంతో రైతులు ధర్నాలు, ఆందోళనలు చేస్తున్నారు.

కనీసం కరువు పరిస్థితుల్లోనైనా రైతులకు ఇన్‌పుట్ సబ్సిడీ గాని, బీమా గాని ఇవ్వలేదు. 20.04.2017న జిల్లా పర్యటనలో ముఖ్యమంత్రి 1030 కోట్ల పంట నష్టపరిహారం

చెల్లిస్తామని ప్రకటించారు. ఇప్పటివరకు ఆ ప్రయత్నాలే మొదలు కాలేదు. ఇంతవరకూ బీమా, ఇన్‌పుట్ సబ్సిడీ ఒకదానికొకటి సంబంధం లేకుండా చెల్లించేవారు. మొదటిసారిగా ప్రభుత్వం రెండింటినీ కలిపి ఇస్తామని ప్రకటించింది. అది కూడా ఎకరాకు రూ.6 వేలు ఇస్తాననింది. వేరుశనగ పంటకే స్కేల్ ఆఫ్ ఫైనాన్స్ ఎకరాకు 20 వేలు ఉంది. బ్యాంకు రుణం తీసుకున్న ప్రతి రైతు నుంచి స్కేల్ ఆఫ్ ఫైనాన్స్ ప్రకారమే 270 కోట్లు ప్రీమియం చెల్లించారు. బీమా మొత్తం రూ.3 వేల కోట్లు రావాలి. జిల్లాకు వచ్చింది కేవలం 360 కోట్లు మాత్రమే. బజాజ్ అలయంజ్ కంపెనీ నుంచి బీమా మొత్తాన్ని వసూలు చేయడంలో ప్రభుత్వం ఎందుకు వెనకంజ వేస్తోందో తెలియదు. చివరికి కరిమింగిన వెలగపండులాగా పంటనష్టపరిహారం /బీమా రాబోతోంది.

**7) పశువుల క్యాంపులు - మేత సరఫరా**

గ్రామీణార్థిక రంగంలో పశు సంపద చాలా ప్రధానమైనది. దాదాపు 80 శాతంగా ఉన్న సన్న చిన్నకారు రైతాంగానికి పశు సంపద పెద్ద ఆలంబన. కరువు కాలంలో పశు సంపదను కాపాడడానికి అవసరమైన అన్ని చర్యలూ తీసుకోవాలని డ్రౌట్ మాన్యువల్ మార్గదర్శకాలు సూచిస్తున్నాయి. కరువు మండలాలు ప్రకటించిన వెంటనే జిల్లా కలెక్టరు జిల్లాలో అందుబాటులో ఉన్న పశుగ్రాసం, ఎంత మేరకు అవసరమయ్యేది అంచనాలు రూపొందించాలి. ఆ తరువాత రాష్ట్ర ప్రభుత్వానికి సవివరమైన నివేదికలు పంపాలి. వెంటనే రాష్ట్ర ప్రభుత్వం జిల్లా కలెక్టరు పశువుల క్యాంపులు నిర్వహించడానికి, పశువుల మేత కొనుగోలు చేయడానికి పూర్తి స్వేచ్ఛనివ్వాలి. జిల్లాలోని పశువుల మేత జిల్లా సరిహద్దులు దాటిపోకుండా జిల్లా కలెక్టరు చర్యలు తీసుకోవాలి.

కరువు మండలాలుగా ప్రకటించిన తరువాత కూడా జిల్లా నుంచి నిరాటంకంగా పశువుల మేత ఇతర ప్రాంతాలకు తరలిపోతూనే ఉండటం అధికారుల ఉదాసీనతకు పరాకాష్ట.

ఈలోగా జిల్లా యంత్రాంగం 6 వేల టన్నుల (సైలేజ్) మాగుడు గడ్డిని జిల్లా యంత్రాంగం దిగుమతి చేసుకుంది. ప్రభుత్వం మాగుడు గడ్డిని కేజీ రూ.6.80 కే కొనుగోలు చేసి సబ్సిడీపై రైతుకు రూ.2 వంతున సరఫరా చేస్తోంది. అధికారుల మాటలు నమ్మి వేల రూపాయలు ఖర్చుపెట్టి ఈ గడ్డి కొనుగోలు చేసిన రైతులు తీవ్రంగా నష్టపోయారు. గడ్డిమూటలు విప్పి చూస్తే గడ్డి కుళ్లిపోయి దుర్వాసన వేస్తోందని ఆరోపిస్తున్నారు. ఈ గడ్డి తింటే పశువుల ముక్కుల్లో రక్తం కారడంతో పాటు, అజీర్తి రోగాలు కూడా వస్తాయని కొంతమంది పశువైద్యులే చెబుతున్నట్లుగా పత్రికల్లో వార్తా కథనం బట్టి తెలుస్తోంది. అయితే అధికారులు రైతుల నుంచి ఎలాంటి ఫిర్యాదులు రాలేదని మాత్రం చెబుతున్నారు. కరువు సహాయక కార్యక్రమాలు ఈ విధంగా కూడా సాగుతాయి.

**8) వైద్య సౌకర్యాలు**

కరువు ప్రాంతాల్లో నీటి ఆధారిత జబ్బులు వచ్చే అవకాశం ఎక్కువగా ఉంది కనుక ప్రభుత్వం ప్రత్యేకించి దృష్టి సారించాలని డ్రాట్ మాన్యువల్ సూచిస్తోంది. నీటి వనరుల్లో తరచుగా క్లోరినేషన్ చేస్తూ ఉండాలి. అంటువ్యాధులు ప్రబలే అవకాశం ఉంది గనుక ప్రత్యేక వైద్య టీములను ఏర్పాటు చేయాలి. కరువు ప్రాంతాలకు అవసరమయ్యే మందులను సేకరించి జిల్లా కేంద్రంలో నిలువ ఉంచాలి.

చాలా అస్తవ్యస్తంగా ఉన్న శాఖల్లో ఆరోగ్యశాఖ ఒకటి. జిల్లాలో గ్రామీణ ప్రాంతాల్లో ఉన్న పీహెచ్‌సీలకు మందుల సరఫరా ఉండదు. మందులుంటే సిబ్బందిఉండరు. ప్రజలకు జబ్బులొస్తే ప్రైవేటు వైద్యం మీద ఆధారపడా



ల్సిందే. ప్రైవేటు వైద్యం గ్రామీణ ప్రాంతాల ప్రజల మూలుగుల్ని పీల్చిపిప్పి చేస్తున్నది. ఎంతో కష్టపడి వైద్యం కోసం జిల్లా కేంద్రానికి వస్తే, ఈ ఆసుపత్రి వైద్యులు కర్నూలు, బెంగళూరు, హైదరాబాద్ పొమ్మంటారు. వైద్యం ఒక మాఫియాగా మారిపోయింది. జిల్లాలోని చాలా తండాల్లో ఇళ్ల వద్ద వృద్ధులు, పిల్లలు మాత్రమే ఉంటారు. వారికి చిన్న జ్వరం వచ్చినా ఆదుకునే నాథుడులేడు. వాస్తవానికి జిల్లా వ్యాప్తంగా 5-6 మొబైల్ మెడికల్ వ్యాన్‌లు వారానికి ఒక రోజు ప్రతి గ్రామం పోయివచ్చే విధంగా ప్రభుత్వం ఏర్పాటు చేయాల్సి ఉంటుంది. కానీ ప్రజలు కేవలం ఓటుకు పనికొచ్చే సాధనాలుగా మాత్రమే భావించే నాయకులున్నంత వరకూ పరిస్థితి మారదు.

**ముగింపుగా...**

ప్రభుత్వం తాను రూపొందించిన చట్టాలు, మార్గదర్శకాలను తానే ఉల్లంఘిస్తోంది. కరువు కాలంలోనూ బతికే హక్కు అందరికీ ఉంది. ప్రభుత్వ సాయం పొందే హక్కు కూడా అందరికీ ఉంది. ఈ హక్కుల ఉల్లంఘన మానవ హక్కుల ఉల్లంఘనగానే పరిగణించాలి. కరువు పరిస్థితుల్లో ప్రజలను, రైతులను ఆదుకోవడంలో ప్రభుత్వం చూపిస్తున్న నిర్లక్ష్యం క్షమించరానిది.

# బోడి కోడె

**వి.వి. కొండారెడ్డి**
**సెల్ : 9490055220**

ఎండపొద్దు సురసుర కాల్తాంది. ఊరిముందరుండె రేగడి చేలో గుంత తియ్యడం సులువే. అయినా మాంచి రేపటెండలో గుంతతీసే ఓబిగాడు, ఎల్లుగాడు, నంబరు మల్లిగాడు గసపోస్తాండారు.

సొక్కాల్లేని వుత్తపెయి మీద సెమట కాలవల్లా కారుతాంది. సెప్పినా యినకుండా ఎంటపడి వచ్చిన పిల్లోల్లు ఎండకు తట్టుకోలేక గెట్టువారుండే కానిగెసెట్లకిందకిపోయి రొంతసేపు ఉండి మళ్లీ వచ్చి వంగోని తొంగి గుంతదిక్కే సూస్తాండారు. వలకల్లో ఎక్కనో తీతవపిట్ట "కిర్ కిర్ కిర్" అని అరుస్తామొత్తుకుంటోంది. ఊరకుంటలో పసుల పిల్లజీతగాడు 'అదిగోద్వారక ఆలమందలవిగో' అంటూ పాడిందే పాడతావున్నాడు తనలోకంలో.

గుంత ఇంగారొంత లోతుగా తీయండ్రా ల్యాకపోతే నక్కలు తోడతాయి అని మల్లారెడ్డి కూలోళ్లను ఎచ్చరించినాడు.

ఏనుగంతుండే బోడికోడెను టైర్లబండి నొగలు ఎగనెత్తి మెల్లగా కిందివైపు నేలమీదికి ముందరావెనక విడిగా తాళ్లతో కాళ్లకు గుదికట్టి మధ్యన కాడెమాన్లను అడ్డంగా దూర్సిపెట్టి అటుపక్క ఇటుపక్క ముందర పదిమంది ఎనకల పదిమంది కాడెమాన్ల ఆసరాతో బోడికోడెను అతికష్టంగా జరిపి దించి పెట్టినారు. నేనుమాత్రం ఎట్లానిల్చుండేవాణ్ణి అట్టాగే దిగాలుగా ఉన్నాను. కోడెదిక్కు సూసినట్లుగానేఎక్కన్నో సూసినట్లుండాయి నా సూపులు.

మావూరి తాగేనీళ్లు ఉప్పులు అందుకేనేమో ఎంత మంచి పసరాలకైనా కీళ్లనొప్పులు వచ్చి సచ్చుబడతాయి. దానికి విరుగుడుగా మావూర్లోని నాటువైద్యుడు ఆచారి సుబ్బయ్య 'వాతల వైద్యం' (మక్కి మీద, వీపుపైన కాల్చిన ఇనుప కడ్డీతో గుండ్రంగా వాతలు వేయుట) సూదిమందుల డాక్టరు ఇచ్చిన చేదుమందు టానిక్కులు వెదురుబొంగు గొట్టంలో పోసి మోరపైకి ఎత్తిపెట్టి నాలుక బయటకు ఒక పక్కకు జరిపి ఒడుపుగా పట్టుకొని గొంతులో పోస్తాంటిమి. మందుచేదుకు కళ్లు మూసుకొని మింగేటప్పుడు నాకైతే సూడ్డానికి మనసొప్పక పక్కకు తిరిగేసి మందు మింగేంటం దుకు గొంతుకింద సేత్తో మెల్లగా సాఫీగా సాదేవాణ్ణి. శానా రోజులు మెత్తబడి కాయలా ఎక్కువై బోడికోడె సచ్చినాది. ఇప్పుడు కూడా నిద్దరపోతున్నట్లే వుంది, సచ్చినట్లుగా లేదు.

పక్కనుండే నక్కలపల్లెలో పాలపంటి దూడను బేరమాడకుండా కొని రెండు పగ్గాలతో ముందొకరు, ఎనకొకరు పట్టుకొస్తాంటే వూరి ముందర గవినికాడ నుంచి తప్పెట్ల మెరవణితో వూరేగింపుగా యింటికి పట్టుకొస్తావుంటే వూరు వూరంతా బజరుకు ఇరుపక్కల నిల్సొని దాని నడకతీరు దిక్కే సూస్తావుంటారు. బెదురు బెదురుగా సూస్తూ తప్పెట్ల శబ్దానికి చెవులు రిక్కించి బెదరక కుదురుగా ఠీవిగా యువరాజల్లే నడుస్తా వస్తోంది.

ఇంటికాడ తలవాకిట్లో నిల్చి ఎర్రనీళ్లు దిగదీసి బొట్టుపెట్టి గడపదాటేటప్పుడు కుడికాలు ముందు పెట్టింది (అందుకే బిడ్డొచ్చినవేళ, ఎద్దొచ్చినవేళ అన్నారు పెద్దలు).

కొమ్ములు బోడిగా వెనక్కి వంగినట్లుంటే అందుకే దీన్ని బోడికోడె అని పేరుపెట్టి పిలుచుకొనేవాళ్లం. మెల్లంగా కాడిమరగడం మొదలుపెట్టినాము. కాడిమాను మొట్టమొదట మెడమీద పెట్టగానే సక్కిలిగిలి పెట్టిన్లుందేమో అట్లాడే పిల్లోడు ఎగుల్లేసినట్లు ఎగరడం, దాన్నిచూసి మా నాయన నగతా వుండేవాడు. మాయిటాలప్పుడు ఈరికెమాను కట్టి వంకలో ఇసుకలో మా నాయనా నేను దాని కాడిమరిపినాము. తొలిగ్గా ఈరికమాను మీద నేనొక్కన్నే ఎక్కి నిల్చి తోల్తావుంటే నిలబడ్డా ముక్కి, ముక్కి ఈడ్చేది. మా నాయన ముందుప క్కన రెండోపగ్గం చేతబట్టి రా, రా... భీముడు మల్లె మల్లె ఓ ప్ప, ఓప్ప ఓఓఓ అంటూ ఒడుపుగా ఓర్పుగా, నేర్పుగా ఈడ్పు నేర్పించినాము. దాని జతలో మట్టెలకోడె. దానిపేరు రాముడు. రెండూ రామలక్ష్మణుల్లాగా వొద్దిగా పనిబాటల్లో చూసేటోళ్లకు ఇంగారోంచేపు సూస్తామనిపిచ్చేలా వుంటాయి.

పాలపళ్లూడిపోయి ఆరుబంటికి వచ్చేతలికి సెండుబాగా పెరిగి ఒకపక్కకు కొంచెం వొరిగినట్లుంది. 'మైల్రావు' తో మెడకింద మెడమీద పక్కల నల్లగా బొచ్చు వచ్చింది అంటే ప్రాయం వచ్చినట్లు లెక్క. పనిబాట్లో దాంట్ల బిస సూస్తే మనం తినకపోయినా సరే దాంట్లకు పెట్టాల్సిందేనని ఏ కాపోడైనా అనాల్సిందే. అట్టానే అది బతికినన్నాళ్లు పుటికెమేత లేని రోజే లేదు.

రెండు మూడేండ్లు భీముడుకు వలపట పనిచేసే రాముడు కూడా అప్పుడప్పుడు మెత్తబడతాడు. అప్పుడేమో మా నాయన భీముని వైపుకి పోగువేసి రాముడికి బరువు తగ్గించేవాడు. బండికైనా, సేద్యానికైనా బోడికోడె నడకతీరు సూసి తీరాల్సిందే సేద్యగాడైనోడల్లా.

నా పెండ్లిరోజు మెరవణి బండికి వలపటపక్కన పోటుగుంజగా కాడెమానుకు మూలపోటుగా కట్టి దాపటపక్కన బోడికోడెను (భీముడు) కట్టినారు. పెండ్లికి వచ్చిన సుట్టపక్కాలు వూర్లో జనమంతా సూసింది పెండ్లికొడుకు, పెళ్లికూతుర్ను కాదు సెండుసుట్టూ వేసిన మెరిసే వెండిగొలుసు, నడుంకు సుట్టూ కట్టిన సిలకల బొడ్డారు, కొమ్ముల మధ్య తలగజ్జెలు, వాటి మధ్యన మెరిసే అద్దాల బిళ్లల తళుకు బెళుకువు పక్కన వేలాడే రంగురంగుల జలతాళ్ల కుచ్చులతో ఠీవీగా వున్న బోడికోడెను సూస్తావున్నారు.

ఉగాది పండగ వచ్చిందంటే వంకలో, ఇసుకలో బండికి రెండుచక్రాలు తిరక్కుండా మోకులో బిగ్గట్టి బండిపైన నిండుగా జనాన్ని ఎక్కించి ఈడ్పించటం మామూలే. కాని మా నాయన నగల్లో కూర్చోకుండానే ముందునుండి పగ్గాలు సేతబట్టి తను వెనక్కు నడుస్తా రారా భీముడు రారా రాముడు దాదా అని నోటరిక్కలు కొడుతూ సైగల్తో పిలుస్తావుంటే నా సామిరంగా రాముడు, భీముడు రెండూ వొద్దిగ్గా ముందుకు అడుగులేస్తు తోకలెత్తి బండిని లాక్కుంటూ వస్తాంటే జనమంతా ముక్కున వేలేసుకొని సూస్తా ఈ కోడెలేమి కోడెల్రా నాయనా ఆయప్ప ముందుగనుక ల్యాకపోతే దౌడు తీస్తాయి రోయ్ అని అంటూవుంటే నాకు బోసంబరమైపో యింది.

శివరాత్రి పండగ అయినాక పార్ణంరోజు పక్కవూర్లో సింతతోపులో తుమ్మలపల్లె చింతల గంగమ్మ తిరునాళ్లో సొగ బండలాగే పంద్యాలకు మా కోడెలు కూడా తీస్కపోయినాము. మాచీటి మూడో నెంబరు వచ్చింది. పోటీ మొదలైంది. మావంతు పిలుస్తానే కాడెమానుకు ఇనుప గొలుసులతోకట్టి సొగ బండకు బొట్టుపెట్టి టెంకాయ కొట్టి పగ్గాలు సేతబట్టి కోడెల ముందర మా నాయన రుమాలు నెత్తికి బిర్రుగా సుట్టి చాల కోళ భుజాన వున్నది సేతబట్టి వెనక్కు నడుస్తా కోడెల ముందర నుంచి ఎచ్చరికగా రిక్కగొట్టి రా, రా... రామ్మ రా, రా... రాముడు భీముడు అంటూ పేరుపెట్టి పిలిచే. అంతే రెండూ ఒక్కసారిగా సొగబండ తమ బలానికి లెక్కలేదంటూ అలకాంగ గుదెకట్టెను ఈడ్చుకొచ్చినట్లు తోకల్లేపి పరుగు లాంటి నడకతో నడుస్తాంటే జనం ఒకటే ఈలలు, కేకలు ఆ సంబరం సూస్తాంటే నాకైతే సంతోసం పట్టలేక కోడెల ముం దర పక్కకు జరగండి జరగండి అని ముల్లుబర్ర సేతబట్టుకొని నేలకేసి కొడ్తాంటే జనం పక్కకు జరిగిరి. పందెం గెలిసినాక అదేపనిగా వచ్చి మా కోడెల్ను తిరునాళ్లోని జనమంతా బేరిగట్టి సూడబట్టిరి. నాకైతే ఎంత ఆనందమైందో మాటల్లో సెప్పలేనబ్బా.

తోట దగ్గర పచ్చిమిరపకాయలు కోస్తావుంటే మూటెలు బండికి ఏసుకొని తీసుకొచ్చేటందుకు పోయి రొంత పురసతి దొరికిందని కోడెలను బాయిసుటకారం గడ్డి బాగా పెరిగుంటే మేతకిడిస్తిని నా భార్య ఈరమ్మ బాయిగట్టునుండే గడ్డికోస్తా అక్కడే వరగడ్డంగా బాయికాడ వుండే రేగుచెట్టు పండ్లను ఏరుతావుంది. అందీ అందక వుండే కలమాగిన పండ్లకై బాయిగడ్డపైనున్న రాయిపై కాలువేసి అందుకోబోయి కాలికింద రాయి కదిలిపాయ రాయితోపాటుగా బాయిలోకి జారి దబేల్‌మని శబ్దంతో రాయి ముందు ఎనకాల ఈరమ్మ బాయిలోని నీళ్లల్లో పడింది. అది సూసిన బోడికోడె (భీముడు) ఏమితోసిందో ఏమోగాని బాయిసుట్టు అంబా అంబా అంటూ మోర ఎత్తి అరుస్తూ తోకలేపి తిరుగుతావుంది. ఇది సూసిన కూలోళ్లు నేను బావిదగ్గరకు వచ్చి ఈరమ్మ కేకలు విని బాయిలోకి దిగి పైకి తెచ్చినాము.

సరిగా ఎత్తండి పట్టండి పట్టండి అంటున్నారంతా. నేను నా పాత జ్ఞాపకాల్లోంచి మన మతిలోకి వచ్చి సూసేసరికి బోడికోడెను నాలుగు కాళ్లు ముడిచి గుంతలో పండబెట్టినారు. పారతో మట్టి ఏస్తున్నారు. నేను మెల్లగా లేసిమట్టి వేయబోతే సేతులు వణకబట్టె మట్టికంటే ముందు నా కల్లల్లోంచి కన్నీటిబొట్టు బొట్లుబొట్లుగా గుంతలోకి జారిపడె. పాయంలో అది సేసినపని బురదల్లో ఇరుక్కున సొప్ప బండిని మూలమోకుకట్టి పసికోడెమీదనే బరువువేసి లాగిచ్చిన రోజులు తలుచుకొని నేను బాధగా నిట్టూర్చినాను.

(17వ పేజీ తరువాయి)

ఐరన్ మామూలు కంటే ఎక్కువ తీసుకోవాలి. 32 గ్రామ్స్/డే ఇవ్వాలి. పప్పులు, గింజలు, ఆకుకూరలు, మాంసం, వేరుశనగ విత్తనాలు, అటుకులు, ఎండుకొబ్బరి తదితర వాటినుంచీ ఐరన్ (ఇనుము) లభిస్తుంది. వీటితో పాటు విటమిన్-సీ తీసుకోవటం వల్ల (పాలకూర, నిమ్మజాతికి చెందిన పండ్లు, ఉసిరి) తీసుకునే ఆహారం నుంచీ ఇనుము బాగా గ్రహింపబడుతుంది.

తీసుకోవాల్సిన ఆహార పాదార్థాలు

| క్ర.స. | ఆహార పదార్థం | మోతాదు | ప్రొటీన్లు | కెలొరీలు |
|---|---|---|---|---|
| 1. | పాలు | 4 భాగాలు | 20 గ్రా.. | 400 కెలొరీలు |
| 2. | పప్పు | 2 భాగాలు | 12 గ్రా... | 200 |
| 3. | మాంస పదార్థాలు | 1 భాగం | 10 గ్రా... | 100 |
| 4. | కాయగూరలు | 4 భాగాలు | - | 100 |
| 5. | పండ్లు | 3 భాగాలు | - | 150 |
| 6. | ధాన్యాలు | 9 భాగాలు | 18 గ్రా... | 900 |
| 7. | కొవ్వులు | 5 భాగాలు | - | 500 |
| 8. | చక్కెర | 40 గ్రా... | - | 160 |

కాఫీలు, టీలు తీసుకోవడం వల్ల ఇనుము గ్రహించడం తగ్గిపోతుంది.

## గర్భవతిగా ఉన్నప్పుడు వచ్చే సమస్యలు

**టాక్సిమియా :**

గర్భవతిగా ఉన్నప్పుడు వచ్చే రక్తపోటును టాక్సిమియా అని అంటారు. ఇది 20వ వారంలో వాపులు, శరీరంలో అల్బుమిన్ ఎక్కువకావటం ఇంకా పరిస్థితి విషమిస్తే వాయువు, కోమాలోకి పోవటం రూపాల్లో కనిపిస్తుంది. దీనిని అశ్రద్ధ చేస్తే పుట్టబోయే బిడ్డ మరణానికి దారి తీస్తుంది. మంచి మాంసకృత్తులు (ప్రొటీన్లు) ఉన్న ఆహారం తీసుకోవడం వల్ల, ఉప్పు తగ్గించడం వల్ల దీనిని అరికట్టవచ్చు. సాధార ణంగా పోషకాహార లోపం టాక్స్మియాకు దారితీస్తుంది.

**రక్తహీనత (అనీమియా)**

ఇది గర్భవతుల్లో సాధారణంగా కనిపిస్తుంది. హీమో గ్లోబిన్ 10 గ్రాములకంటే తక్కువగా ఉంటే దీనినే రక్తహీనత అంటారు. సరైన మాంసకృత్తులు కలిగిన ఆహారం, ఐరన్ ఎక్కువ ఉన్న ఆహార పదార్థాలు తీసుకోవడం వల్ల రక్తహీనతను అరికట్టవచ్చు.

**వాంతులు, వికారం :**

దీనినే సాధారణంగా మార్నింగ్ సిక్నెస్ అని కూడా అంటారు. ఇది గర్భం దాల్చిన మొదటి దశల్లో కనిపిస్తుంది. ముఖ్యంగా ఉదయం నిద్రలేవగానే మొదలవుతుంది. అం దువల్లనే దీనినే మార్నింగ్ సిక్నెస్ అంటారు. దీనికి సులభమైన ట్రీట్‌మెంట్ ఏమిటంటే ఆహారం పట్ల సహనం. చాలాసార్లు చాలా ఆహార పదార్థాలు వాసనలు, రుచులు పడకపోవటం జరుగుతుంది. రస్కులు, బిస్కెట్లు ఉదయం లేవగానే తీసుకోవాలి. దీని వల్ల వికారం తగ్గుతుంది. చిన్న చిన్న మోతాదుల్లో ఎక్కువసార్లు ఆహారం తీసుకోవాలి. దీని లోపాలు అజీర్ణం కూడా ఒక సమస్య. తక్కువ మసాలాలు తీసుకోవ టం, ఎక్కువ మంచినీళ్లు తాగటం వల్ల దీనిని దూరం చేయ వచ్చు.

**మలబద్ధకం :** చాలా శాతం గర్భవతుల్లో మలబద్ధకం కనిపిస్తుంది. దీనికోసం పీచు ఎక్కువగా ఉన్న ఆహారం తీసుకోవాలి. పొట్టుతో కూడిన ధాన్యాలు, ఆకుకూరలు, చిక్కుడు జాతికి చెందిన కాయగూరలు, పండ్లు, నీళ్లు, ద్రవపదార్థాలు ఎక్కువగా తీసుకోవాలి.

**మధుమేహం, ప్రెగ్నెన్సీ :** గర్భవతిగా ఉన్నప్పుడు మధుమేహం (డయాబెటిస్) కనబడితే మితంగా ఆహారం ప్రతి రెండు గంటలకు ఒకసారి తీసుకోవాలి. తీపి పదార్థాలు తగ్గించాలి. పిండి పదార్థాలు మితంగా తీసుకోవాలి. మాంసకృత్తులు, తీసుకునే కెలొరీలు సరిగా విభజించుకోవాలి.



ఆహార పట్టిక

| | |
|---|---|
| ఉదయం 6 గంటలకు | పాలు, రస్కులు / బిస్కెట్లు |
| 8 గంటలకు | బ్రెడ్డు, జామ్ దోసె /ఇడ్లి / పెసరట్టు / కాయగూరలతో ఉప్మా / చపాతి / రొట్టెలు కూరలతో లేదా చట్నీతో ఉడికించిన కోడిగుడ్డు, అరటిపండు |
| 10 గంటలకు | ఉడికించిన పెసలు /సెనగలు / అలసందలు / మొలకలు / మజ్జిగ / రాగి గంజి / బర్ఫీ |
| 12 గంటలకు | అన్నం / రాగిముద్ద / చపాతీలు / రొట్టెలు, పప్పు, పాలకూర వేపుడు, పెరుగు |
| 2 గంటలకు | వేరుశనగ విత్తనాలు వేయించినవి-1 చిన్న కప్పు |
| 4 గంటలకు | పది గంటలకు చెప్పిన విధంగా |
| 7 గంటలకు | మధ్యాహ్న భోజనం లాగే |
| పడుకునేముందు | పండు, మజ్జిగ |

# 'భూతాపం'తో కరవులు, వరదలు







- శిలాజ ఇంధన కాలుష్యంతో పెనుముప్పు
- ఆర్కటిక్ వేడెక్కి ఉత్తరార్ధగోళంలో ఉష్ణ, శీతల మహాతరంగాల స్తంభన

(పతకమూరు దామోదర ప్రసాద్)
సీనియర్ జర్నలిస్టు, 9440990381

ప్రపంచ వ్యాప్తంగా సాగుతున్న పర్యావరణ విధ్వంసాన్ని అరికట్టడానికి నివారణ చర్యలు చేపట్టకపోవడం వల్ల భూతాపం పెరిగి వాతావరణంలో విపత్కర మార్పులు సంభవిస్తూ మానవాళి మనుగడపై తీవ్ర ప్రభావం చూపుతోంది. ఆర్కిటిక్ ఉత్తరధృవ ప్రాంతం క్రమంగా వేడెక్కుతూ ఉత్తరార్ధగోళంలో ఉష్ణ, శీతల మహావాయుతరంగాలు ఇతర ప్రాంతాలకు వ్యాపించడంలో ఎదురవుతున్న విపరీత వాతావరణం వల్ల తరచుగా కరువులు, దుర్భిక్షాలు, వరదలు సంభవించి ప్రపంచ ప్రజలు అనేక కష్టనష్టాలు ఎదుర్కొంటున్నారు.

పర్యావరణాన్ని పరిరక్షించాలని, మహా కాలుష్యానికి కారణమవుతున్న శిలాజ ఇంధనాల వాడకాన్ని తగ్గించి, ప్రత్యామ్నాయ ఇంధనాలను వినియోగించుకోవాలని ప్రకృతి ప్రేమికులు, పర్యావరణవేత్తలు పదే పదే హెచ్చరిస్తున్నా ఆ దిశగా ప్రయత్నాలు అనుకున్నంత వేగంగా జరగడం లేదు. శిలాజ ఇంధనాలను అధికారికంగా వాడటం వల్ల బొగ్గుపులుసు వాయువులు (కార్బన్ డయాక్సైడ్) అధికారికంగా వాతావరణంలోకి ప్రవేశించడం వల్ల భూగోళం ముఖ్యంగా ఉత్తరార్ధగోళంలో శీతల ఆర్కటిక్ ప్రాంతం వేడెక్కి ఉష్ణ, శీల మహావాయుతరంగాల కదలికలను నిరోధిస్తున్నట్లు, ఫలితంగా ప్రపంచంలో అనేక చోట్ల తరచుగా వానల్లేక దుర్భిక్షాలు, మరికొన్నిసార్లు అకాల వర్షాలు, వరదలు ఏర్పడుతున్నట్లు శాస్త్ర పరిశోధకులలో వెల్లడైంది.

విపరీత వాతావరణ కాలుష్యం, తత్ విష ఫలితాల వల్ల ప్రపంచ వ్యాప్తంగా సంచరించాల్సిన ఈ ఘన ఉష్ణ, శీతల వాయు తరంగాలు ఎక్కడికక్కడ స్తంభించిపోవడం లేదా ఆలస్యంగా మంద్ర స్థాయిలో సంచరించడం వల్ల ఎన్నో ప్రాంతాలు వేడెక్కుతున్నాయి. ఏప్రిల్, మే నెలలు మండుటెండలకు ఆలవాలమని తెలిసిందే. అయితే ఈసారి ఆంధ్రప్రదేశ్, తెలంగాణా సహా దేశంలోని అనేక ప్రాంతాల్లో ఉష్ణోగ్రతలు గరిష్టంగా 45-50 డిగ్రీలకు పెరగడం వల్ల ఈ ఎండల తాకిడి, తీవ్ర వడగాల్పుల వల్ల ఎందరో అకాల మృత్యువుపాలైనారు. తాగడానికి నీరులేక జంతువులు, పక్షులు దాహార్తితో తల్లడిల్లి సొమ్మసిల్లి ప్రాణాలు కోల్పోతున్నాయి. అనేక ప్రాంతాల్లో బావులు, చెరువులు, కుంటలు, రిజర్వాయర్లు ఎండిపోవడం కనిష్టమట్టానికి పడిపోవడం వల్ల 'గంగమ్మ' పాతాళానికి చేరడం వల్ల తాగునీరు లేక కోట్లాది ప్రజలు తల్లడిల్లుతున్నారు. దాహార్తితో ఎందరో తపించిపోయారు. మానవులు సహా సకల జీవకోటికి జలమే జీవం... నీరే ప్రాణాధారం. అయితే వాతావరణంలో సంభవిస్తున్న పెనుమార్పులు ముఖ్యంగా ఆర్కటిక్ సముద్రపు మంచుగడ్డలు కరగడంపై ప్రభావం చూపింది. గాఢమైన ఈ తీవ్ర వడగాల్పులు తరచూ సంభవించే అవకాశముందని వాతావరణ శాస్త్రవేత్తలు హెచ్చరిస్తున్నారు. ఈ వాతావరణ కాలుష్య విష ఫలితాలు ప్రపంచంలో అనేక చోట్ల కనిపిస్తున్నాయి. దేశంలో అనేక చోట్ల ముఖ్యంగా దక్షిణాదితో రాష్ట్రాల్లో ఈ ఏడాది సంభవించిన తీవ్ర దుర్భిక్షం, నీటి కొరతలు రానున్న పెనుముప్పునకు సంకేతాలు.

అయినా మనం ఈ విపరీత పర్యవసానాల నుంచి గుణపాఠాలు నేర్చుకోం. భూతాపం పెరగడం, వాతావరణ కాలుష్యం, పర్యావరణ విధ్వంసం మానవాళి కార్యకలాపాలను ప్రభావితం చేస్తాయని శాస్త్రవేత్తలు, పరిశోధకులు ఎప్పటికప్పుడు హెచ్చరిస్తూనే ఉన్నారు. వాతావరణంలో వచ్చే

మార్పులు శీతోష్ణ స్థితులను ప్రభావితం చేస్తాయని, ఒకటి, రెండు డిగ్రీల ఉష్ణోగ్రతలు పెరిగితే మరిన్ని వడగాల్పులు సంభవిస్తాయని శాస్త్రజ్ఞులు అంటున్నారు. మానవుల అలవాట్లు ముఖ్యంగా కాలుష్య కారకమైన వాటిని మార్చుకోవాలి. ప్రపంచ దేశాల ప్రజలు తీవ్రకాలుష్యకారకాలైన శిలాజ ఇంధనాలను అధికారికంగా వాడటం పర్యావరణానికి పెను ముప్పుగా పరిణమించింది. దీని వల్ల బొగ్గు పులుసు వాయువులు అధికంగా వాతావరణంలో చేరి వేసవిలో విపత్కర వదరలు, దుర్భిక్షాలు, వడగాల్పులు సంభవించడం వల్ల జన జీవనం దుర్భరమవుతోంది. తీవ్ర ఉష్ణోగ్రతల వల్ల నేలల్లో తేమ కోల్పోయి పొడిబారుతున్నాయి. ఉష్ణప్రాంత పసిఫిక్ మహాసముద్ర ఉపరితల ఉష్ణోగ్రతలు మరింత పెరుగుతున్నాయి. ఆర్కిటిక్ మహాసముద్రంలో ఈ అధిక ఉష్ణోగ్రతల వల్ల హిమఖండాలు కరగడం, ఉష్ణ, శీతల మహావాయు తరంగాలు కదలికలపై పెను ప్రభావం వల్ల ఎన్నో వాతావరణ విపత్కర పరిస్థితులు ఏర్పడుతున్నాయి. మానవుల అలవాట్ల కారణంగానే ఈ ఉష్ణోగ్రతలు, వాతావరణమార్పులు, భూగోళ శీతోష్ణ వాయు తరంగాల కదలికలకు నేరుగా సంబంధమున్న విషయం ధృవపడుతోంది.




అమెరికాలోని కాలిఫోర్నియాలో 2016లో ఏర్పడిన తీవ్ర దుర్భిక్షం, 2011లో అమెరికాలో వచ్చిన తీవ్ర వడగాల్పులు, 2010లో పాకిస్తాన్‌లో వచ్చిన వినాశకర వరదలు, 2003లో యూరప్ దేశాల్లో వీచిన వడగాల్పులు ఈ విపరీత, విపత్కర వాతావరణ పెనుమార్పుల ఫలితమేనని అమెరికాలోని పెన్సిల్వేనియా స్టేట్ యూనివర్సిటీకి చెందిన శాస్త్రవేత్త మైకేల్‌మాన్ అన్నారు. ఇవన్నీ ఆందోళనకరమన్నారు. మానవ కార్యకలాపాల కారణంగా భూగోళ మహా శీతోష్ణ వాయుతరంగాల కదలికలు, దుర్భిక్షాలు, వరదలపై ప్రత్యక్ష స్వభావమున్నట్లు తమ పరిశోధనల్లో తేలిందని మాన్ అన్నారు. ఈ శీతోష్ణ వాయుతరంగాలు భూ భ్రమణంలో సహజంగా ఏర్పడే వాతావరణం ద్వారా ఉత్పన్నమైనవే. ఆర్కిటిక్ భూ మధ్యరేఖల మధ్య సంచరిస్తాయి.

పీడనవ్యవస్థలు, కారుమబ్బులతో కలిసి ఈ తరంగాలు ఉష్ణాన్ని, తేమను తరలిస్తూ వాతావరణంపై పెను ప్రభావం కలిగిస్తాయి. విపరీత వాతావరణ పరిస్థితులకు కారణమయ్యే తీవ్ర కారుమబ్బు తరంగాలు, ఇందుకు కారణమైన మానవ కార్యకలాపాలు, ఈ రెండు కలిసి వాతావరణంలో విపత్కర పరిస్థితులకు కారణమవుతున్నట్లు గ్రహతరంగాలపై తాము చేసిన పరిశోధనలు, కంప్యూటర్, తదితర విశ్లేషనల ద్వారా ధృవపడిందని అధ్యయన పత్ర రచయిత, పరిశోధకుడు మైకేల్‌మాన్ వెల్లడించారు. శిలాజ ఇంధనాల వాడకం వల్ల కార్బన్ డయాక్సైడ్ అధికాధికంగా వాతావరణంలో చేరి ఈగ్రహతరంగాల వ్యాప్తికి, చలనానికి అవరోధాలు కలిగిస్తున్నాయని, ఈ తరంగాలు కదలకుండా అలా నిలిచిపోవడం వల్ల ఎక్కువ కాలం అదేరకం వాతావరణం నెలకొని, దుర్భిక్షాలు, వరదలు సంభవిస్తున్నట్లు మాన్ చెప్పారు. వారాల తరబడి ఇదే రకమైన వాతావరణం ఒకే ప్రాంతంలో నెలకొంటే ఎండ రోజులు తీవ్ర వడగాల్పులుగా, మారవచ్చనీ, దుర్భిక్షాలు, అధిక వర్షాల వల్ల వరదలూ సంభవమని ఈ అధ్యయన పత్ర సహరచయిత, జర్మనీకి చెందిన పోస్ట్‌డా వాతావరణ ప్రభావ పరిశోధనా సంస్థకు చెందిన స్టీఫెన్ రహమాస్టర్ తెలిపారు. ఇవికొన్ని నిర్దిష్టపరిస్థితుల్లో సంభవిస్తాయని, అప్పుడు అంతరంగాలు పశ్చిమం నుంచి తూర్పునకు కదలకుండా అలా స్తంభించి నిలుస్తాయని, ఉష్ణోగ్రతలలో ఉన్న వ్యత్యాసాలే అందుకు కారణమని స్టీఫెన్ చెప్పారు. రెండు పరిణామాల వల్ల ఇలా జరుగుతోందని, మొదటిది ఆర్కటిక్ ప్రాంతంలో భూతాపం ఉష్ణోత్రలు పెరగడం. ఇందువల్ల భూమధ్యరేఖకు, ఆర్కటిక్ ప్రాంతానికి మధ్య ఉష్ణోగ్రతల్లో తేడాలు తగ్గిపోతాయి. రెండోది సముద్రాల కంటే భూ ప్రాంతాలు వేగంగా వేడెక్కడం. వేసవిలో ఇది మరింత ఎక్కువ. ఈ రెండు కారణాల వల్ల అంతర్జాతీయంగా శీత, ఉష్ణవాయు చలనాలకు అంతరాయం ఏర్పడి, వాతావరణంలో విపరీత పరిణామాలు సంభవిస్తాయి.

వేసవి కాలంలో ఆర్కటిక్ హిమప్రాంతంలో మంచు కరిగి, వాతావరణ మార్పులపై అది కలిగించే పెను ప్రభావాలు, వర్షాలపై దాని ప్రభావాలను మాన్ ఆయన సహ శాస్త్రవేత్తల అధ్యయనంలో వెల్లడైన అంశాలు మనకు కొత్త దుక్కోణాన్ని అందిస్తున్నాయి. ఆర్కటిక్ శీతల ప్రాంతంలో మంచు కరగడానికి వాయువ్య భారతదేశంలో వర్షాలు పడటానికి గల సహ సంబంధాన్ని, భారత అంటర్కటిక్, సముద్ర పరిశోధన జాతీయ సంస్థ శాస్త్రవేత్తల పరిశోధనల్లో వెల్లడైంది. ఆర్కటిక్ ప్రాంతం భూగోళానికి రిఫ్రిజిరేటర్‌గా పనిచేస్తుంది. ఉష్ణ ప్రాంతాల వేడి నీటిని గ్రహించి చల్లబరుస్తుంది. ఇందువల్ల సముద్రాల లవణ సాంద్రత పెరుగుతుంది. అందువల్ల వేడినీరు సముద్రాల అడుగుకు చేరి ఉష్ణోగ్రత విడుదల అవుతుంది. అయితే ఆర్కటిక్ మంచు ఖండాలు తరగడం ఈ ప్రక్రియకు అంతరాయం కలిగిస్తుంది. మంచు కరగడం వల్ల ఆర్కటిక్ ప్రాంతంలో మంచినీరు ఎక్కువవుతుంది. ఇందువల్ల సముద్రాల ఉప్పు నీటి సాంద్రత తగ్గుతుంది. ఫలితంగా వేడినీ

రు సముద్రం అట్టడుగుకు చేరి ఉష్ణోగ్రత విడుదల కావడం తగ్గుతుంది. ఈనీరు దక్షిణ దిశగా పయనించి, ఉష్ణ ప్రాంతం లో భూమికి సముద్రాలకు మధ్యగల ఉష్ణోగ్రతల తేడాను తగ్గి స్తుంది. తత్ఫలితంగా వర్షపాతంపై పెనుప్రభావం కలుగుతుం ది. భూగోళ ఉష్ణోగ్రతలను పారిశ్రామిక విప్లవం నాటి స్థాయికి, అంటే 2 డిగ్రీల సెంటీగ్రేడ్‌కంటే పెరగకుండా నిరోధించడా నికి గట్టి చర్యలు చేపడతామని పారిస్‌లో జరిగిన వాతావరణ సదస్సులో ప్రపంచ దేశాలు ప్రతిన బూనాయి. అయితే 1986-2005 సంవత్సరాల మధ్య కంటే ఆర్కిటిక్ ప్రాంతం అధికంగా 5 నుంచి 9 డిగ్రీల సెంటీగ్రేడ్‌ల మధ్య పెరుగుతుందని, ఆర్కిటిక్, ఉష్ణ ప్రాంతాల ఉష్ణోగ్రతల్లో వ్యత్యాసం తగ్గితే, వాయు తరంగాల చలనం తగ్గుతుందని, ఫలితంగా సముద్ర జలాలు చల్లబడటం తగ్గి దుర్భిక్షాల, వడగాల్పులు, వరదలకు దారితీస్తుందని శాస్త్రజ్ఞులు తేల్చారు. ప్రతికూల వాతావరణ మార్పులు రాకుండా నివారించాలంటే ప్రపంచ దేశాలు కార్బ న్‌డైయాక్సైడ్ తదితర కాలుష్యకారకాలు వాతావరణంలో ప్రవే శించకుండా నివారణ చర్యలు చేపట్టాలి. శిలాజ ఇంధనాల వాడకాన్నిత గ్గించాలి. అలా వాతావరణం కాలుష్యాన్ని, బొగ్గుపులుసు వాయువుల ప్రభావాన్ని తగ్గించే చర్యలు చేపట్ట కపోతే తరచుగా ప్రతికూల వాతావరణ మార్పులతో మానవ జీవితం తల్లడించాల్సి వస్తుందని శాస్త్రవేత్తలు హెచ్చరించారు. సకల జీవకోటి ముఖ్యంగా మానవ మనుగడపై పంటలపై, ఆలోచనలపై, ఆరోగ్యంపై తీవ్ర ప్రభావం చూపే ఉష్ణోగ్రతల పెరుగుదలను, వాతావరణం కాలుష్యాన్ని నివారించడానికి అ న్ని దేశాల ప్రజలు ఒక ఉద్యమంగా చేపట్టి, అందరినీ చైత న్యపరిస్తేనే ఈ విపరీత పరిస్థితుల నుంచి తప్పించుకొని, మనగల్గుతాం.

**యుద్ధాలకు ఆజ్యం... అదే**

ప్రపంచ వ్యాప్తంగా సంభవిస్తున్న వాతావరణ విప రిణామాలే నాలుగోవంతు యుద్ధాలు, సాయుధ సంఘర్షణ లకు కారణమని వాతావరణ మార్పుల ప్రభావ అధ్యయన సంస్థ పాట్స్‌డామ్ నిర్వహించిన పరిశోధనల్లో తేలింది. నానాటికీ వాతావరణంలోకి కార్బన్ ఉద్గారాలు అధికంగా చేరి హానికర మార్పులు రావడం, బొగ్గు నిక్షేపాలు తగ్గిపోవడం, మనం పీల్చే ప్రాణవాయువు నాణ్యత తగ్గడం, అధిక ఉష్ణోగ్ర తల వల్ల వ్యాధులు పెరగడం, ప్రకృతి విపత్తులు భయాన్ని తొలగించాలంటే వాతావరణ కాలుష్యాన్ని, ఉష్ణోగ్రతల తగ్గింపునకు తక్షణ కార్యాచరణ అమలు చేయాల్సి ఉంది.

వాతావరణ మార్పుల వల్ల మానవ ఆలోచనలు ప్రభావితమై అశాంతి, అసహనం, ఆగ్రహాలు పెరిగి ప్రపంచ దేశాల్లో జరుగుతున్న యుద్ధాలలో, 4వ వంతు అందుకు కారణమవుతున్నాయని, వివిధ జాతులు, తెగలు, ముఖ్యంగా ఇరాక్, సిరియా, సొమాలియాలో జరుగుతున్న యుద్ధాలను, సంఘర్షణలను నిశితంగా పరిశీలిస్తే వెల్లడైంది. 1960 నుంచి 2010 వరకు ప్రపంచ దేశాల్లో జరిగిన ప్రకృతి విపత్తులు, సాయుధ సంఘర్షణలను, నాటి సహసంబంధాలను పాట్స్ డాం సంస్థ అధ్యయనం చేసింది. ఈ ప్రకృతి వైపరీత్యాలు, వాతావరణ మార్పులకు గల సహసంబంధం 23 శాతంగా ఉన్నాయని, అయితే అన్నీ విపత్తుల వల్లే జరిగాయని చెప్పలేమని అధ్య యన బృందం అధ్యక్షుడు డాక్టర్ కారిఫల్‌ష్నర్ తెలియజేశారు. ఉత్తర, మధ్య ఆఫ్రికా, మధ్య ఆసియా దేశాలు ఉష్ణ మండల ప్రాంతాలు. వాతావరణ పెను మార్పుల వల్ల అక్కడి జనంలో పెరిగే ఆవేశాలు, ఆగ్రహాలు, అసహనం, సహజ సంబంధీకునే అయినా తరచుగా సంఘర్షణలకు దిగి అమితుమీ తేల్చుకునే ప్రకృతి వల్ల ప్రపంచ శాంతికే ముప్పు వాటిల్లుతోంది. వాతా వరణ తీవ్ర ప్రభావం వల్ల ఆఫ్రికా దేశాల్లో తరచుగా కరువులు ఏర్పడి,



ఉన్న వనరుల కోసం పరస్పర యుద్ధాలు, ఇతర దేశా లకు వలస వెళ్లడం సాధారణమైంది. ఆఫ్రికన్‌లు యూరప్ దేశాలకు వలసవెళ్లడం వల్ల అక్కడా ఘర్షణలు, సామాజిక అ శాంతికి, ఉగ్రవాద చర్యలకు కారణమై యూరోపియన్ యూ నియన్ బీటలు వారుతున్న విషయం తెలిసిందే. వాతావరణం లో, పెనుమార్పుల వల్ల ఆఫ్రికా, పశ్చిమాసియా దేశాల్లో అధి కారం కోసం, సహజ వనరులపై పెత్తనం కోసం నిత్య సంఘ ర్షణలవల్ల, ఏకాకితనం, ఇతరులకు దూరంగా ఉండటం వల్ల అధ్వానమైన పాలన సాగుతోందని ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శి ఆంటోనియో గుటెర్రెస్ అన్నారు.

సిరియాలో 2007-2010 సంవత్సరాల మధ్య నెల కొన్న తీవ్ర కరువు పరిస్థితులే 2011 తిరుగుబాటుకు ఆజ్యం పోశాయని, వివిధ మతాలు, తెగల మధ్య అక్కడి వనరులపై ఆధిపత్యం కోసం సంఘర్షణలు నిత్యకృత్యమయ్యాయని అ మెరికా, కొలంబియా యూనివర్సిటీకి చెందిన శాస్త్రవేత్తల అ ధ్యయనంలో తేలింది. వర్షాలు లేక, పంటలు పండక బతుకు కోసం లక్షలాది మంది రైతులు, కూలీలు నగరాలకు తరల డం, పరిమిత వనరులు ఆహారం కోసం పోటీ, వివిధ తెగల మధ్య అనుమానాలు, అపోహలు సంఘర్షణలకు లక్షలాది మంది వలసలకు కారణమని, సిరియా ప్రభుత్వానికి పాలన పై పట్టులేక సంక్షోభం నెలకొందని ఆ అధ్యయనం తేల్చింది.




# ఎవరి కోసం ఈ కసరత్తు

సమాజం అవసరాలను దృష్టిలో ఉంచుకొని కాలంతో పాటుగా విద్యావ్యవస్థ మారుతూవుండాలి. వలస పాలనలో వ్యవస్థీకృతం అయిన విద్యా వ్యవస్థను తమ అవసరాలకు అనుగుణంగా తీర్చిదిద్దాలని మెకాలే సంకల్పించాడు. భారతీయ పోలికలు, ఆకారం కలిగి ఉన్నా బ్రిటీషు వారి లక్షణాలు, స్వభావం, అలవాట్లపట్ల అంకిత భావం కలిగిన ఒక సంకర జాతిని సృష్టించడానికి అనువైన విద్యావిధానం ఉండాలని నిర్దేశించాడు. తెల్లవారిని తరిమివేసి 70 సంవత్సరాలు అవుతున్నా ఈ దేశ ప్రయోజనాలను, ప్రజల అవసరాలను తీర్చే విద్యావిధానం కోసం దేశం ఎదురు చూస్తోంది. స్థానిక ప్రజల అవసరాలు అర్థం చేసుకోవడానికి ఓరియంటల్ భాషల్ని కూడా నాటి విద్యావిధానం ప్రోత్సహించింది. ఈ నేపథ్యంలో 1986 సంవత్సరంలో నూతన విద్యావిధాన ప్రకటన తర్వాత 2016 సంవత్సరంలో మరో నూతన విద్యావిధాన ప్రకటన ప్రభుత్వం నుంచి వెలువడింది.

1986 సంవత్సరంలో అప్పటి ప్రధాని రాజీవ్ గాంధీ దేశాన్ని ప్రపంచ మార్కెట్‌లోకి ప్రవేశపెట్టేందుకు కంప్యూటర్ నైపుణ్యంగల కార్మికుల్ని ఉత్పత్తి చేయాలి. వీరికి ఇంగ్లీషు వచ్చి ఉండాలనేది దాని లక్ష్యం. ఆ తర్వాత కాంగ్రెస్ హయాంలోనే దేశం ప్రపంచీకరణ దశలోకి ప్రవేశించింది. ప్రతి అంశాన్ని ప్రతి వ్యవస్థని దేశ విదేశీ పారిశ్రామిక వేత్తల ప్రయోజనాలకు అనుగుణంగా 1986లో విద్యా ప్రణాళికను ప్రైవేటీకరణ చేశారు.

బ్రిటీషు హయాం నుంచి 1986 దాకా ప్రభుత్వ పాఠశాలలు, సంస్థలు ప్రభుత్వ సహాయంతో నడిచే ఎయిడెడ్ పాఠశాలలు/విద్యా సంస్థలు, ప్రైవేటు వ్యక్తుల ట్రస్టులు, సంఘాలుగా నడిపే విద్యా సంస్థలు అనేక రకరకాల పరిస్థితులు ఉండేవి. ఇవి ఏకీకృతంగా కాకుండా బహుళ యాజమాన్యంలో నడుస్తుండేవి. వీటి మధ్య పోటీ పెద్దగా ఉండేది కాదు. ప్రత్యేకించి ప్రాథమిక, మాధ్యమిక విద్యారంగం అంతా ప్రభుత్వం ఆధ్వర్యంలోనే నడిచేది. ఈ కారణం వల్ల అసంఖ్యాకంగా మధ్యతరగతి, పేద పిల్లలకు చదువు లభించేది. కానీ 1986 ప్రణాళిక పోటీ పెంచడానికి బదులు ప్రైవేటీకరణకు ప్రత్యక్షంగా బాటలు వేసింది. ప్రభుత్వం విద్యావ్యవస్థకు అవసరం అయిన నిధులు పెరిగే అవసరాలకు అనుగుణంగా పెంచకుండా వెనక్కు తగ్గింది. పెరుగుతున్న విద్యావసరాలను తీర్చాల్సింది ప్రైవేటు పాఠశాలలేనని సందేశాన్ని చెప్పకనే చెప్పింది. దాంతో పుట్టగొడుగుల్లా ప్రైవేటు విద్యా సంస్థలు పుట్టుకువచ్చాయి. వీటిపై పెట్టుబడులు పెట్టడం ద్వారా నియంత్రణ లేకుండా ఫీజులు పెంచి లాభాలు గడించారు. తమకు లాభం తెచ్చే కోర్సులను మాత్రమే ప్రైవేటు విద్యా సంస్థలు ప్రారంభించాయి.

ప్రభుత్వం అనియత విద్య, దూరవిద్య, ప్రైవేటుగా చదువుకోవడం లాంటి అవకాశాలను కల్పిస్తూ పేదల చదువును సౌలభ్యం కలిగిస్తున్నట్లు కనిపించినా, నిజానికి సార్వత్రిక నిర్బంధ ఉచిత విద్య తప్ప మన దేశంలో పేద పిల్లలందరికీ చదువు అందే అవకాశం లేదని కొఠారి కమిషన్ ఏనాడో తేల్చిచెప్పింది. అయినా ప్రభుత్వం పాఠశాలల్లో సౌకార్యలను మెరుగుపరిచేందుకు ఏ ప్రయత్నమూ

జరగలేదు. 2009 సంవత్సరంలో సుదీర్ఘ పోరాటం ఫలితంగా విద్యాహక్కు చట్టం వచ్చే వరకూ కనీస మౌలిక సదుపాయాలకు నిధులు కేటాయించలేదు. తగినంత మంది ఉపాధ్యాయుల నియామకం నేటికీ జరగలేదు. పాఠశాలల పనితీరుపై, బోధనపై తనిఖీ దాదాపుగా అటకెక్కింది. ప్రభుత్వ పాఠశాలలు ఉపాధ్యాయుల్లో కొంతమంది ఎవరూ పట్టించుకోలేరన్న చోట్ల తమ బదులు విద్యావలంటీర్లను నియమించి, తమ జీతంలోంచి కొంత జీతం ఇచ్చి తమ స్థానంలో పనిచేయించడం కూడా పత్రికలకెక్కింది. విద్యానాణ్యత ప్రమాణాలు పెంచడం అంటే పాసయ్యే విద్యార్థుల సంఖ్య పెంచడమేనని భావించే అధికార యంత్రాంగం 'ఉత్తీర్ణత' 'కోటాలు' ఏర్పడటంతో ఫలితాల కోసం అడ్డదార్లు తొక్కుతున్నారు.

అనేక లోపాలున్నప్పటికీ అత్యంత అర్హతలు, పరిజ్ఞానంగల ఉపాధ్యాయులు ప్రభుత్వ రంగంలోనే వున్నారు. వీరి ద్వారా ఉన్నత ప్రమాణాలు తేవాలంటే విద్యా హక్కు చట్టం సరిపోదు. ప్రభుత్వ ఉద్యోగులు, ప్రజా ప్రతినిధులు, ఏ స్థాయి వారైనా వారందరి పిల్లల్ని ప్రభుత్వ పాఠశాలలకు పంపడం తప్పనిసరి చేసితీరాలి.

ప్రపంచ వ్యాప్తంగా సాంకేతిక విస్పోటనం కారణంగా సాఫ్ట్‌వేర్ నేర్చుకొని పనిచేసే కంప్యూటర్ గుమస్తాల అవసరం ఒక్కసారిగా పెరిగిపోయింది. అభివృద్ధి చెందిన దేశాల్లో నైపుణ్యంగల ఉద్యోగులు చాలా ఖరీదు. పైగా వారి సంఖ్య తక్కువ. మన దేశంలో ప్రభుత్వ పెట్టుబడితో చదివి నైపుణ్యం పొందినవారు చౌకగా ఎగుమతి అయ్యారు. ఈ జోరును మరింత పెంచుకోవడానికి ఇక్కడే కార్యాలయాలు ప్రారంభించి, ఒక స్థాయి నైపుణ్యంగల వారందరికీ అకస్మాత్తుగా భారీ మొత్తంగా జీతాలు ఎరవేసి, అందరికీ ఆశ కలిగేలా చేశారు. ఉన్నత మధ్యతరగతి విద్యావంతులు దీని ద్వారా బాగానే లాభపడ్డారు.




విదేశీ వ్యామోహంలో పడిన తల్లిదండ్రులు తమ స్తోమతకు మించి తమ పిల్లల్ని ఇంగ్లీషు నేర్పే పాఠశాలల్లో చేర్పుతున్నారు. దీంతో పట్టణ ప్రాంతాల్లోనే కాదు మండల గ్రామస్థాయిలో కూడా ఇబ్బడి ముబ్బడిగా ఇంగ్లీషు మీడియం స్కూళ్లు వెలిశాయి. వీటిలో ఇంగ్లీషు మాట అటుంచి తెలుగు కూడా చెప్పడం రాని, ఇంటర్, డిగ్రీ చదివిన వారు అంతి తక్కువ వేతనాలతో టీచర్లయ్యారు. వీరికి బోధించడం రాదు కాబట్టి రుబ్బించడం అనే చిట్కా కనిపెట్టారు. ఇక్కడి విద్యార్థులు మధ్యతరగతి వారు కావడంతో రాయడం తప్ప నేర్చుకునే అవకాశం లేక అధిక శాతం డ్రాపవుట్స్‌కి కారణం అవుతున్నారు. మన బాల కార్మికులు కూడా ఈ స్కూళ్ల పుణ్యమా అని ఏదో కాస్త ఇంగ్లీషు మాటలు మాట్లాడగలిగే తెలివిపరులయ్యారు. జీన్సు ప్యాంట్లు వేసుకొని, సెల్‌ఫోన్ వాడే సామర్థ్యం ఏర్పడింది.

కార్పొరేట్ పాఠశాలలు అనేక బ్రాంచిలుగా విస్తరించారు. వీరి లాభాల్లో ఖచ్చితమైన శాతం అంటే 10-15 శాతం సొమ్మును ప్రారంభం నాటి నుంచి నేటిదాకా వ్యాపార ప్రకటనలపై వెచ్చిస్తున్నారు. మొదటి ఇది కొంచెం ఎక్కువని బాధపడినా వ్యాపారంలో పెరుగుదల చూసి దాన్ని అలాగే కొనసాగించారు. దీనితో పాటు అధికారులను మేపడానికి అంటే, ఆటస్థలాలు, లాబొరేటరీలు, లైబ్రరీలు వంటి సదుపాయాలేమి లేకున్నా అనుమతులివ్వడానికి, అనువైన పరీక్షా కేంద్రాల ఏర్పాటుకూ, ప్రశ్నాపత్రాల తాలూకు రహస్యాలకు, ర్యాంకుల కేటాయింపుల మతలబులకూ ఇలా అనేక రకాల ఖర్చులను భరించారు.

ఈ కార్పొరేట్ పాఠశాలలకే ఎల్‌కేజీ నుంచి ఐఐటీ కోచింగ్, టెక్నో స్కూల్స్, కంప్యూటర్ విద్యవంటి పేర్లు పెట్టడంతో తల్లిదండ్రులు పులకించి పోయి వేలల్లో, ఒక్కోసారి లక్షల్లో కూడా ఫీజులు కట్టి తమ పిల్లల్ని ఇందులో కుక్కేస్తున్నారు. పిల్లల్లో బట్టీపట్టే సామర్థ్యాన్ని బట్టి వారిని ఏబీసీడీలుగా విభజించి, తక్కువ బట్టీపట్టి సామర్థ్యమున్న పిల్లల్ని 'డీ' తరగతిలో వుంచి, వారికి ప్రత్యేకతరగతులు చెప్పినం దుకు ఫీజులు కూడా కట్టించుకుంటారు. పదో తరగతి దాకా ఫీజులు గుంజి వీరితో ప్రైవేటుగా పరీక్ష రాయించి వందకి వంద ఉత్తీర్ణత అంటూ ప్రకటనల ద్వారా ఊదరగొట్టడం.

ఉదయం 4 గంటలకు లేచింది మొదలు రాత్రి 11 గంటల వరకూ పడుకునే దాకా ఊపిరి తీయనంత చదువు, క్రమశిక్షణ. శారీరక అవసరాలకు ఎక్కువగా సమయం తీసుకున్నా కఠిన దండన. తల్లిదండ్రులను, బంధువులను కలవడానికి, ఆంక్షలు, ఈ జైలు జీవితం భరించలేక బిడ్డలు ఆత్మహత్యలు చేసుకోవడం... కొన్ని వందల ఆత్మహత్యలు మాఫీ జరిగింది ఉభయ రాష్ట్రాల కార్పొరేట్ బళ్లల్లో. ఆటపాటలతో తనవారి మధ్యన వారి కష్ట నష్టాల్ని అర్థం చేసుకుంటూ, ప్రశ్నిస్తూ నేర్చుకునే సహజ వాతావరణంలో వికాసం చెందగల అవకాశాన్ని ప్రైవేటు విద్య పిల్లలకు లేకుండా చేస్తోంది.

వ్యాపారానికీ, కార్పొరేట్‌కు పిల్లల్ని అప్పగించి విద్యను సరుకుగా మార్చిన ఏ దేశం ముందుకు సాగలేదు. విద్యపై పెట్టుబడులు పెట్టిన ప్రభుత్వాలు, పూర్తి ఉచిత విద్యనందించిన దేశాలే ప్రపంచ పటంలో అభివృద్ధిలో అగ్రగామిగా వున్నాయి. స్వార్థ ప్రయోజనాలతో, సంకుచిత దృష్టిలో అవగాహన లేమితో నేడు కర్రతుమ్మ కంపలాగ విస్తరిస్తున్న విద్యా వ్యాపారం ఈ దేశ భవిష్యత్తు వేరును తినేస్తున్న ప్రమాదకరం అయిన పురుగు...

**- దేవీ, సాంస్కృతిక కార్యకర్త.**






## రూ.7 లక్షల కోట్ల మొండి బకాయిలతో

# బ్యాంకుల విలవిల

(గత సంచిక తరువాయి)

స్వాతంత్ర్యానంతరం భారత ప్రభుత్వం మిశ్రమార్థిక విధానాన్ని అవలంభించి ప్రభుత్వ, ప్రైవేటు రంగాలను ప్రోత్సహించింది. సత్వర పారిశ్రామికాభివృద్ధి కోసం పారిశ్రామిక, వాణిజ్య సంస్థలు, కంపెనీలకు అవసరమైన స్వల్ప, దీర్ఘకాలిక పెట్టుబడులను, వనరులను అందించడానికి భారత ప్రభుత్వం 1948లో భారత పారిశ్రామిక , ఆర్థిక సంస్థ (ఇఎఫ్‌సీఎం)ను, పూర్తిగా ప్రభుత్వ రంగంలో నెలకొల్పింది. 1955లో ప్రైవేటు రంగంలో భారత పారిశ్రామిక పరపతి, పెట్టుబడుల సంస్థను, 1964లో రిజర్వు బ్యాంకు అధీనంలో భారత పారిశ్రామికాభివృద్ధి (ఐడీబీఐ) బ్యాంక్‌ను, ఇతర మంత్రిత్వ శాఖల నియంత్రణలో వివిధ పారిశ్రామిక ఆర్థిక సంస్థలను నెలకొల్పి పారిశ్రామిక సంస్థల దీర్ఘ, మధ్య కాల రుణావసరాలను తీరుస్తున్నాయి. వాణిజ్య బ్యాంకులు ఆయా పరిశ్రమలకు అవసరమైన నిర్వహణ మూలధనం, స్వల్పకాల రుణావసరాల తీరుస్తున్నాయి. 1981లో రూ.6,143 కోట్లు మాత్రమే ఉన్న అభివృద్ధి ఆర్థిక సంస్థల ఆస్తులు 1990-91 నాటికి రూ.52,054 కోట్లకు, 1998-99 నాటికి రూ.1,58,379 కోట్లకు పెరగడం గమనార్హం. దీర్ఘకాల జాతీయ పారిశ్రామిక పరపతి కార్యకలాపాల నిధి నుంచి ఈ పారిశ్రామిక సంస్థలకు కొంత చౌకగా నిధులు లభిస్తున్నాయి.



పతకమూరి దామోదర ప్రసాద్
సీనియర్ జర్నలిస్టు
సెల్ : 9440990381

అందువల్లనే ఈ ఆర్థిక సంస్థలు బ్యాంకులు, తదితర మధ్యవర్తి ఆర్థిక సంస్థల ద్వారా ఆయా పరిశ్రమలకు మళ్లీ చౌకగా అవసరమైన పునఃపెట్టుబడులను సమకూరుస్తూవచ్చాయి.

అయితే దేశంలో 1991లో ప్రారంభించిన సంస్కరణల వల్ల పరిశ్రమల దీర్ఘకాల అవసరాలకు చౌకగా లభించే నిధుల రాక ఆగింది. 1989-90లలో భారత పారిశ్రామికాభివృద్ధి బ్యాంకు రిజర్వు బ్యాంకు నుంచి తీసుకునే రంగాల 23 శాతంగా, రూపాయి బాండ్లు 40 శాతంగా ఉండేవి. అందువల్లనే ఇండికాం, అభివృద్ధి ఆర్థిక సంస్థలు (డిఎఫ్ఇ) ఇతర బ్యాంకులు, మధ్యవర్థి సంస్థల ద్వారా వివిధ పారిశ్రామిక సంస్థలకు రీఫైనాన్స్ (పెట్టుబడులు) సమకూర్చేది. తదనంతర చర్యలలో భాగంగా సీఆర్ఆర్ (నగదు రిజర్వు నిష్పత్తి), ఎస్ఎల్ఆర్‌లకు తక్కువ స్థాయి పరిమితులు విధించడం వల్ల బ్యాంకుల వాణిజ్య, పారిశ్రామిక సంస్థల దీర్ఘకాల, స్వల్పకాల పరపతి అవసరాలు తీర్చగలవని భావించారు. పెట్టుబడి మార్కెట్ బ్రాండ్ మార్కెట్‌లను విస్తృతపరచడం ద్వారా దీర్ఘకాలిక రుణావసరాలు తీరగలవని భావించారు.

అయితే బ్యాంకింగ్ సంస్కరణలు వేగం పుంజుకునే కొద్దీ అభివృద్ధి ఆర్థిక సంస్థల (డీఎఫ్ఐ)ల పాత్ర, ప్రభావం

క్షీణించి వాణిజ్య, పారిశ్రామిక సంస్థలకు చౌక రుణాల లభ్యత తగ్గింది. చౌక నిధుల లభ్యత తగ్గిపోగా ఈ అభివృద్ధి ఆర్థిక సంస్థలు ఇచ్చే రుణాల వడ్డీరేట్లు బ్యాంకులతో సమానం కాగా పోటీలో నిలవలేకపోయాయి. పెట్టుబడి మార్కెట్‌ల నుంచి, విదేశీ వాణిజ్య రుణాల ద్వారా బ్యాంకులు మరిన్ని నిధులు చేకూర్చుకోగలగడం వల్ల డీఎఫ్‌ఐల రుణ వితరణకు అవరోధం కలిగింది. ప్రైవేటు, ప్రభుత్వ-ప్రైవేటు బ్యాంకులకు అనుమతి ఇవ్వడం వల్ల ఐడీబీఐ, ఐసీఐసీఐ వాణిజ్య బ్యాంకులేర్పడ్డాయి.

బ్యాంకుల మధ్య, దీర్ఘకాలిక రుణాలు 2016 మార్చి నాటికి మొత్తం రుణాల్లో 50 శాతానికి పెరిగాయి. ఇచ్చే రుణాలకు పూచీగా తీసుకునే ఆస్తులకు పొంతనలేక మొండి బకాయిలు పెరుగుతున్నాయి. అందువల్ల పరిశ్రమలకు దీర్ఘకాల రుణాలు బ్యాంకులివ్వలేని స్థితికి చేరుతున్నాయి. అందువల్ల వాణిజ్య, పారిశ్రామిక సంస్థల మధ్య దీర్ఘకాల పెట్టుబడి అవసరాలు తీర్చడానికి ప్రత్యేక బ్యాంకు ఏర్పాటు చేయాలని బ్యాంకింగ్ నిపుణులు సూచిస్తున్నారు. భారత ప్రభుత్వ యాజమాన్యంలో ఈ పెట్టుబడి బ్యాంకును ఏర్పాటు చేస్తే అర్హులైన సంస్థలకు, తయారీ, మౌలిక రంగ కంపెనీలకు ఆ బ్యాంకు రుణ సహాయం అందించి ఆదుకోగలుగుతుంది. రుణ ప్రతిపాదనలను సంబంధిత రంగాల నిపుణుల ద్వారా మదింపు చేయించి, అవసరమైన మేరకు పరపతి సాయమందించగలుగుతుంది. ప్రపంచ బ్యాంకు, ఆసియా అభివృద్ధి బ్యాంకు తదితర విదేశీ సంస్థల నుంచి చౌకగా రుణాలు తీసుకోవడానికి ఈ పెట్టుబడి బ్యాంకుకు అనుమతిస్తే చౌక రుణాలు అంది పారిశ్రామిక సంస్థలకు చౌకగా దీర్ఘకాలిక రుణాలివ్వగలుగుతుంది.

ప్రపంచ శ్రేణి బ్యాంకుగా ఎస్‌బీఐ

భారతీయ స్టేట్ బ్యాంకు ఈ ఏప్రిల్ 1న తన అనుబంధ స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ (ఎస్‌బీహెచ్), స్టేట్ బ్యాంక్ ఆఫ్ మైసూర్ (ఎస్‌బీఎం), స్టేట్ బ్యాంక్ ఆఫ్ ట్రావెన్‌కోర్ (ఎస్‌బీటీ), స్టేట్ బ్యాంక్ ఆఫ్ పాటియాలా (ఎస్‌బీపీ), స్టేట్ బ్యాంక్ ఆఫ్ బీహార్, అండ్ జైపూర్‌లతోపాటు, భారతీయ మహిళా బ్యాంక్ బ్రాంచిలను విలీనం చేసుకుని ప్రపంచ శ్రేణి బ్యాంకుగా ఎదగడం హర్షణీయం. ఆస్తుల రూపేణా రూ.41 లక్షల కోట్లు, 2లక్షల 77వేల మంది ఉద్యోగులు, 22,500 శాఖలు, 58 వేల ఏటీఎంలు, 50 కోట్ల ఖాతాదార్లతో ఎస్‌బీఐ ప్రపంచంలో 50వ పెద్ద బ్యాంకుగా అవతరించడం ఆనందదాయకం. దేశంలో బ్యాంకులిచ్చే రుణాలు, తీసుకునే డిపాజిట్‌లలో నాలుగోవంతు ఎస్‌బీఐదే కావడం అభినందనీయమే. సాలీన లాభాలతో బాటు ఖర్చులు, అనుబంధ బ్యాంకుల నుంచి వచ్చే 70 వేల మంది సిబ్బంది భారమూ గణనీయం.

ఎస్‌బీఐ 19వ శతాబ్దంలో 'ప్రెసిడెన్సీ బ్యాంక్'గా ఏర్పడి, 1806లో బ్యాంక్ ఆఫ్ కలకత్తాగా ఆవిర్భవించి క్రమేణా ఇంత పెద్ద బ్యాంకుగా మారింది. వచ్చే రెండేళ్లలో పాలన ఖర్చుల తగ్గింపు, వివిధ విభాగాలు, శాఖల హేతుబద్ధీకరణ ద్వారా రూ.2700 కోట్ల వరకు ఆదా చేయవచ్చని నిపుణుల అంచనా. స్వచ్ఛంద పదవీవిరమణ పథకాల ద్వారా అనుబంధ, సొంత బ్యాంకు సిబ్బందిని తగ్గించుకోవచ్చు. 2016 డిసెంబర్ నాటికి ఎన్‌పీఏ మొండి బాకీలు 7.2 శాతం. ప్రస్తుతం మొండి బాకీలు లక్ష కోట్లు కాగా, పునవ్యవస్థీకరించిన వాటాతో సహా ఇబ్బందికర రుణాలు రూ.1.4 లక్షల కోట్లు. ఎస్‌బీఐ అనుబంధ బ్యాంకుల మొండి బాకీలు 2016 డిసెంబరు నాటికి రూ.55,164 కోట్లు. అదే కాలంలో మొత్తం మొండి బాకీలు (ఎస్‌బీఐ, అనుబంధ బ్యాంకులు కలిపి) రూ.1.16 లక్షల కోట్లు. అంటే మొత్తం రుణాల్లో 8.65 శాతం. ఎస్‌బీఐ మొత్తం ఆస్తులు ప్రస్తుతం జీడీపీలో 25 శాతం. దేశంలో రెండో పెద్ద బ్యాంకు (ప్రైవేటు) హెచ్‌డీఎఫ్‌సీ ఆస్తులు రూ.8.2 లక్షల కోట్లు. ఎస్‌బీఐ ఆస్తుల్లో పదోవంతు.

ఎస్‌బీఐ అనుబంధ బ్యాంకులు విలీనమై ప్రపంచశ్రేణి బ్యాంకుగా అవతరించినా ప్రజలు, ఖాతాదార్లపై నడ్డివిరిచే సేవా చార్జీలు, కనీస నిల్వ, జమ, ఏటీఎంలో డబ్బు తీసుకోవడంపై వేయడం దారుణం. ప్రభుత్వ పథకాలను అమలు చేసే అతిపెద్ద బ్యాంకు ఇలా విపరీతంగా భారీ చార్జీలు విధించి పేద, మధ్య తరగతి ప్రజలను పీడించడం, నిలువుదోపిడీ అని శ్రామికులు విమర్శిస్తున్నారు. దేశంలో ఇంకా కోట్లాది మంది, మారుమూల గ్రామాలు, ఆదివాసీ, వెనుకబడిన ప్రాంతాల వారికి బ్యాంకు సేవలు అందుబాటులో లేవు. జన్‌ధన్ ఖాతాలన్నింటిలో కనీస నిల్వ కూడా లేదు.

పల్లె శాఖల్లో కనీస నిల్వ రూ.2వేలు, పట్టణాల్లో 4 వేలు, మహానగరాల్లో రూ.5 వేలు డిపాజిట్ ఉంచాలనడం, 3 లావాదేవీలను మించితే డబ్బు జమ, తీసుకోవడంపై సేవా చార్జీలు పేరిట దోపిడీ సాధించడం ఎంత మాత్రం సమర్థనీయంగా లేదు. శ్రామికవర్గానికి బ్యాంకుల సేవలను మరింత చేరువ చేస్తామంటున్న ప్రధాని నరేంద్ర మోదీ, ఎన్‌డీఏ ప్రభుత్వ హామీలకు అనుగుణంగా లేదు. ఇంత జరుగుతున్నా రిజర్వు బ్యాంకు ఎలాంటి చర్య చేపట్టకపోవడం, ఎస్‌బీఐ యజమానులు ప్రజలను ఖాతరు చేయకపోవడం శోచనీయం. కోటక్ బ్యాంకు వంటి ప్రైవేటు బ్యాంకు సున్నా నిల్వలకే ఎన్నో సేవలందిస్తుండగా ఎస్‌బీఐ ఇలా చార్జీల బాధడం నిస్సందేహంగా ప్రైవేటురంగ బ్యాంకులను ప్రోత్సహించి, ప్రభుత్వ రంగ బ్యాంకులను నిర్వీర్యం చేయడమే. ఇప్పటికైనా దిద్దుబాటు చర్యలు చేపట్టకపోతే జనాగ్రహానికి గురికాకతప్పదు.

# రాయలసీమ ఉద్యమాలు తీరుతెన్నులు

(ఎన్.ఎస్.ఖలందర్)
స్టీల్‌ప్లాంట్ సాధన సమితి ప్రధాన కార్యదర్శి






ఉద్యమాలు అనగానే మనకు తెలంగాణనే ముందుగా గుర్తుకు వస్తుంది. వారికి జరిగిన అన్యాయానికి వివక్షతకు వారు ఉద్యమించిన తీరు స్ఫూర్తిదాయకం. కరువు, ఫ్యాక్షన్ రాజకీయ ఉచ్చులో చిక్కుకొని వరుస కరువుతో అల్లాడే సీమ ప్రాంతానికి ఉ ద్యమాలు అవసరం. కానీ ఎందుకో ఇక్కడ ఉద్యమాలు త క్కువ. చెరువుల కింద నీళు తాగి, కలో గంజో, అంత రా గిసంగటి ఉంటే చాలు అనుకునే మనస్తత్వం సీమప్రాంత ప్రజలది. పార్టీలతో సంబంధం లేకుండా, ప్రజా ప్రయోజ నాలతో అవసరం లేకుండా, రాజకీయనాయకుల వెంబడి పరిగెత్తే మూకుమ్మడి మనస్తత్వం సీమ ప్రజలది. అందువల్లనే గతంలో కోస్తావాళ్ల కోసం కేకలు పెట్టీ మనకు నీళ్లు రాకుండా చేసుకొని, వాళ్లకి 'నాగార్జున సాగర్'ని సాధించిపెట్టింది. 'విశాఖ ఉక్కు-ఆంధ్రుల హక్కు' అంటూ అరచీ వాళ్లకు 'విశాఖ ఉక్కు'ను తెచ్చిపెట్టింది. నిన్నటికినిన్న తెలంగాణ వెళ్లిపోతుందనీ తెలిసికూడా సమైక్యాంధ్ర కేకలు వేసింది. రాజధానిని కోస్తాకే తరలించుకుపోతున్నా కోస్తా తోకలుగా మిగలాలన్న ఆలోచనే చాలా మందిది. అందుకే నాయకులు అటే నడుస్తారు. ప్రజలు కూడా అటే చూస్తున్నారు. ఓట్ల సీట్ల రాజకీయాల్లో అంకెల గారడీలో సీమా ప్రాంతానికి ఎప్పటికీ ద్రోహం జరుగుతూనే ఉంది.

ఒకప్పటి రాయలసీమ ఉద్యమం వల్ల ఈ ప్రాంతంలో థర్మల్ పవర్ ప్రాజెక్టు వచ్చింది. చిన్న చిన్న పరిశ్రమలు వచ్చాయి. ఉద్యమాలను తమ రాజకీయ ప్రయోజనాలకు ఉపయోగించుకున్న నాయకులందరూ పదవులూ అధికారం దక్కించుకున్నారు. నిజానికి ఇలాంటి వాళ్లే రాయలసీమ ద్రోహులు. రాష్ట్ర విభజన తరువాత రాయలసీమ ప్రజలలో, విద్యార్థుల్లో, ప్రజా నాయకుల్లో అంతర్మథనం మొదలైంది. చిన్నగా ఉద్యమకేకలు వినిపించసాగాయి. అయితే ప్రభుత్వం వాటిని వెలుగులోకి రాకుండా తన ఇనుపపాదంతో తొక్కేస్తూ ఉంది. మొదలైన సీమ ప్రాంత ఉద్యమాల్లో సాగునీటి కోసం జరుగుతున్న ఉద్యమం, స్టీల్‌ప్లాంట్ గమనించిన ఉద్యమం మాత్రమే ప్రణాళికాబద్ధంగా ఉద్యమస్ఫూర్తితో ముందుకు కదులుతున్నాయి. కొందరు రాజకీయ నాయకులు వారి వారి రాజకీయ లబ్ధికోసమో, మనుగడకోసమో ఒక రోజు 'రాజధాని' అంటూ కేకలు వేస్తారు. మరోసారి 'హైకోర్టు' అంటారు. ఇంకోసారి 'రైల్వేజోన్' అంటారు విద్యార్థులను, సీమ ప్రాంతం పట్ల అభిమానం ఉన్న వాళ్లకి తమవైపు ఆకర్షించేటట్లు చేసుకుంటారు. ఇటువంటి వాళ్ల వ్యామోహంతో చిక్కుకోకుండా సీమ ఉద్యమాలు విద్యార్థులనుంచీ, రైతులనుంచీ, మహి ళల నుంచీ, దళితుల నుంచీ మొదలై, సరైన ప్రణాళికతో ముందుకు సాగాలి. పారదర్శకమైన, నిజాయితీతో కూడిన సరికొత్త నాయకులు ముందుకు రావాల్సిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. సీమ సెంటిమెంటు నిన్నటి ఎంఎల్‌సీ ఎలెక్షన్‌లలో పనిచేయలేదు. కారణాలు అనేకం. చిత్తశుద్ధి పారదర్శకత్వం ఉన్న కొత్త తరం నాయకులే సీమ ఉద్యమసారథులుగా రావాలి. బలమైన నాయకత్వంతో కూడిన రాయలసీమ పార్టీ అధికారంలోకి వస్తే తప్ప, సీమ సమస్యలకు సరైన పరిష్కారాలు లభించవు. తెలుగుదేశం పార్టీ గానీ, వైఎస్ఆర్ పార్టీ గానీ 'రాయలసీమ'ను గురించీ అధికారంలో ఉన్న లేకున్నా పట్టించుకోవు. కోస్తా జిల్లాల్లోని ప్రాంతాలకు ధీటైన సంఖ్యగా సీమ ప్రాంత నియోజకవర్గాల వర్గీకరణకై ప్రథమంగా ఉద్యమాలు జరగాల్సి ఉంది. ఈ చిక్కుముళ్లు ముందుగా వీడిపోతేనే సీమ ప్రాంతానికి న్యాయం జరుగుతుంది.

# ఐసీడీఎస్ పీడీ జుబేదా బేగంకు జాతీయ స్థాయి గుర్తింపు

## మేనాక గాంధీచేత ప్రశంస



मंत्री
महिला एवं बाल विकास मंत्रालय
भारत सरकार
नई दिल्ली-110001
MINISTER
MINISTRY OF WOMEN & CHILD DEVELOPMENT
GOVERNMENT OF INDIA
NEW DELHI-110001

नका संजय गांधी
Maneka Sanjay Gandhi

3rd March, 2017

Dear Smt. Zubaida Begum,

I have been informed by Shri Ramachandra Reddy, Chairperson, Advisory Committee, CARA regarding the work done by you in promoting adopting in Ananthapuram District in Andhra Pradesh.

I am happy that you are working so well and I hope that you will keep the momentum going. I wish you all the best.

With best wishes,

Yours sincerely,

(Smt. Maneka Sanjay Gandhi)

Smt. Zubaida Begum
Project Director
DW & CDA
Ananthapuram District
Andhra Pradesh

- రాయలసీమ జాగృతి న్యూస్

అనాథ పిల్లలను దత్తత అందించడంలో స్ఫూర్తిగా నిలిచిన అనంతపురం ఐసీడీఎస్ పీడీ జుబేదాబేగంకు కేంద్ర శిశు సంక్షేమ శాఖ మంత్రి మేనకా గాంధీ అభినందిస్తూ ప్రత్యేక ప్రతినిధి ద్వారా ప్రశంసాపత్రం పంపించారు. ఆర్డీటీ సంస్థ ద్వారా కోటి 25 లక్షలు వ్యయంతో శిశుగృహ నిర్మాణానికి అవసరమయ్యే నిధులను రాబట్టడంలో కృషి చేసినందుకు ఈ గౌరవం దక్కింది. శిశుగృహలో అనాథ పిల్లలను, చెత్తకుప్పల్లో ఉన్న పిల్లలను తీసుకువచ్చి ఆలనాపాలన చూస్తారు. 2016 సంవత్సరంలో రాష్ట్రస్థాయిలో అనంతపురం జిల్లా అత్యధికంగా పిల్లలను దత్తత ఇవ్వడంలో గుర్తింపు సాధించింది. 2017 మార్చిలో ఢిల్లీ నుంచి కమిటీ చైర్మన్ రామచంద్రారెడ్డి బృందం అన్ని రాష్ట్రాల్లోనూ శిశుగృహా ల పనితీరు, దత్తతతీరును పరిశీలించారు. అధునాతన సదు పాయాలతో కూడిన శిశు గృహ ఒక నమూనాగా నిలబడు తుందన్నారు.

**కలెక్టర్ అభినందన :** జిల్లాకు జాతీయ స్థాయి గుర్తింపు తీసుకువచ్చిన ఐసీడీఎస్ పీడీ జుబేదా బేగంను జిల్లా కలెక్టర్ జీ వీరపాండ్యన్ ప్రత్యేకంగా అభినందించారు. కేంద్రం నుంచి వచ్చిన ప్రశంసాపత్రాన్ని ఇటీవల జరిగిన గ్రీవెన్స్ సెల్ కార్యక్రమంలో ఆమెకు కలెక్టర్ అందజేశారు. ఈ కార్యక్రమంలో జిల్లా బాలల పరిరక్షణాధికారి డీ సుబ్రహ్మణ్యం, శిశుగృహాల మేనేజర్ దీప్తి, మురళీ తదితరులు పాల్గొన్నారు.

